కొల్లు రంగారావు

# రేడియో ప్రసంగాలు

వ్యాస సంపుటి



కంకణాల కిషన్ అభినందనలతో

**కావ్య ప్రచురణ**

5-6-2/1/ఎ.
ఎన్. జి. ఓ. కాలనీ,
కామారెడ్డి - 503 111.

# నా మాట

సైఫాబాద్ సైన్స్ కళాశాలలో బి. యస్సీ. చదివే రోజుల్లో ఈ లోకం కవితతో ఫిబ్రవరి '77 లో ఆంధ్రపత్రికకు, ఈ సత్యం ప్రతినిత్యం కవితతో అక్టోబర్ '77 లో ఆకాశవాణి, హైద్రాబాద్ యువవాణికి పరిచయమయ్యాను. అప్పటి నుండి ఇప్పటి వరకు నా రచనల ద్వారా పాఠకులకు, శ్రోతలకు నేను పరిచితుణ్ణి.

తొలినాళ్ళలో ప్రచురింపబడిన వాటిని, ప్రసారం చెయ్యబడిన వాటిని అన్నింటిని క్రమ పద్ధతిలో వుంచుకోలేక పోయాను. ఉన్నవాటిలో కొన్నింటిని "రేడియో ప్రసంగాలు" పుస్తక రూపంలో... విద్యార్థి దశనుండి నన్ను ఆదరించి, నాపట్ల మా కుటుంబంపట్ల అత్యంత ప్రేమాభిమానాలు చూపుతున్న ప్రొ. యం. జనార్ధన్‌రెడ్డి, వారి సతీమణి శ్రీమతి పద్మావతి గార్లకు వారి పదవీ విరమణ సందర్భంగా అంకితమివ్వడం ఆనందంగా వుంది. తొలిగ్రంథం వెలుగు పువ్వులు (1988) నుండి, అత్యంత విశ్వాసంతో అనిల్ ప్రింటర్స్ వారు నా సంపాదకత్వంలో ప్రచురించిన రాష్ట్రకవుల స్వేచ్ఛాస్వరాలు (1996) పుస్తకాలను సమీక్షించిన పత్రికల వారికి, చదివి బాగోగులు తెలియజేసిన పెద్దలు, పాఠక మిత్రులందరకీ... ప్రత్యేకంగా ఆకాశవాణికి,

మానవతా మందిరం, పతాకం స్వేచ్ఛగా ఎగురుతుంది పుస్తకాలను నానుంచి అందుకుంటూ పేజీలైనా తెరవకుండానే తదుపరి మీ పుస్తక ప్రచురణకు రెండువేల రూపాయలు అడిగి తీసుకోండని చెప్పి కావ్య ప్రచురణ తొలికానుకగా తన నిండు మనసుతో అభినందనలు అందించిన శ్రేయోభిలాషి, సహృదయులు శ్రీ కంకణాల కిషన్ గార్కి,

ప్రత్యక్షంగా, పరోక్షంగా నారచనా వ్యాసంగాన్ని ప్రోత్సాహిస్తున్న వారందరికి ధన్యవాదాలు తెలుపుకుంటూ లోపలి పేజీల్లోకి మిమ్మల్ని ఆహ్వానిస్తూ, అమూల్యమైన మీ అభిప్రాయాలకై ఎదురు చూస్తూ...

కామారెడ్డి,
**31-10-1997**

భవదీయుడు,
కొల్లు రంగారావు.

## లోపలి పేజీల్లో

# విశ్వశాంతి స్థాపనలో గాంధేయ వాదం

ఎక్కడైతే సమస్యలుండవో అక్కడి ప్రజలు సుఖ శాంతులతో జీవించగలుగుతారు. ఎక్కడి ప్రజలైతే నిజమైన సుఖశాంతులతో సాగిపోవాలని ఆశిస్తారో వారు నిత్య జీవితంలో సమస్యలెదురైనా వాటిని సామరస్యంగా పరిష్కరించుకోవాలని ఆకాంక్షిస్తారు. తాము స్వేచ్ఛగా జీవిస్తూ ఎదుటి వారి స్వేచ్ఛకి భంగం వాటిల్లకుండా మసలుకుంటారు.

వెన్నెల అనగానే చంద్రుడు, ఎండనగానే సూర్యుడు మన మనసుల్లో మెదలడం ఎంత సహజమో మన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అనగానే అందుకు మూలమైన మహాత్ముని అహింస మన మనసుల్లో మెదలడం అంతే సహజం. శాంతికి మూలం అహింస. ఎందరో మునులు, మహాకవులు, గౌతమ బుద్ధుడు, సోక్రటీస్, రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద మొదలైన మహాపురుషులందరూ అహింసా మార్గానికి మార్గదర్శకులైనారు. మహాత్మాగాంధీ ఈ కోవకే చెందుతారు.

అహింస ద్వారా సాధించలేనిది ఏదీ వుండదని గాంధీజీ విశ్వసించే వారు. స్వాతంత్ర్య సమరములోనైనా మహాత్ముడు ఆంగ్లేయుల విధానాలను నిరసించేవాడు, వ్యతిరేకించేవాడు కాని వ్యక్తులను మాత్రం అసహ్యహించుకునే వాడు కాదు. ఆంగ్లేయులు మనల్ని ఎన్ని రకాలుగా పీడించినా, బాధించినా వారి నుండి మనం విముక్తులమవ్వాలని కోరుకున్నాడే తప్ప వారిని హింసించాలని గాంధీజీ ఏనాడూ కోరుకోలేదు. దీనిని బట్టి మనిషి ని మనిషిగా ప్రేమించే గుణం కన్నా పరమ శత్రువునైనా ప్రాణమిత్రునిగా ప్రేమించే గుణం గాంధీజీలో సుస్పష్టంగా వెల్లడవుతుంది. అహింస అంటే అసమర్ధత ఎంత మాత్రం కాదు. చేతగాని తనంతో ఎదుటి వ్యక్తికి లొంగిపోడం అంతకన్నా కాదు. పరిపూర్ణమైన ఆత్మవిశ్వాసం నిరంకుశుకునికి ఎదురొడ్డి నిలబడటమే దాని పరమావధి. ఎంతటి భయంకరమైన వాతావరణంలోనైనా ఎంతటి దుర్మార్గుడినైనా చిరునవ్వుతో సన్మార్గంలో నడిపించ గలగడం అహింస ప్రత్యేకత.

అహింస, సత్యాగ్రహాలు బలహీనతలకు చిహ్నాలు ఎంత మాత్రం కావు. వ్యక్తైనా, జాతైనా అహింసా విధానాన్ని చేపడితే అదివారి శక్తియుక్తులను సరైన మార్గంలో నడిపించడమే అవుతుందిగాని అది ఆవ్యక్తి బలహీనతను గాని, జాతి దుర్బలత్వానికి గాని మచ్చుతునక కాదు.

తన శక్తిని తాను తెలిసికొనుటకు గాని, ఇతరులకు తెలియ చేయుటకుగాని ఆయుధశిక్షణతో పనిలేదు. ఏ వ్యక్తైనా తన ఆత్మ విశ్వాసాన్ని, ఆలోచనా పరిధిని గుర్తించక తను కేవలం ఒక మాంసపు ముద్దని అనుకుంటేనే ఆయుధాల అవసరం కనిపిస్తుంది. తన శక్తిని తాను తెలుసుకోగలిగిన జాతికి కూడా పక్క రాజ్యాలతో ఏవైనా తగవులుంటే యుద్ధాలతో పని లేదు. సంప్రదింపులతోనే సమస్యలను సామరస్యంగా పరిష్కరించుకోవచ్చు.

గాంధీజీ ఏదైతే బోధించాడో దాన్ని అమలు చేసి చూపించాడు. ఉన్నత విద్యకోసం విదేశంలో వున్నప్పటికీ తల్లికిచ్చిన మాట నిలుపుకునేందుకు ఎన్ని ఒత్తిళ్ళు ఎదురైనా మద్యం, మాంసం ముట్టలేదు. గాంధీజీపై హిందూమత ప్రభావం హెచ్చుగా వున్నప్పటికీ, పరమత సహనం కలిగియున్నవాడు కావున ఏ మతాన్ని కూడా చులకన చేయలేదు. అందుచేతనే ఎందరినో ఆకర్షించగలిగి వారికి మార్గదర్శకుడు కాగలిగాడు. ఎందరో మహానుభావులు జన్మించిన మన దేశంలో గాంధీజీ తనదంటూ ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుకున్నాడు. తన అహింసా మార్గం ద్వారానే భగవంతుని చూసి మోక్షం పొందాలనుకున్నాడు. అందుకేనేమో అహింస ద్వారా ఐక్యతకు గుర్తుగా మిగిలాడు గాంధీజీ.

ఏ దేశంలో ప్రజలైతే అహింసను పాటిస్తారో ఆ దేశంలో రక్షక భటుల అవసరం అంతగావుండదని, వారు ప్రజలపైన అధికారం చెలాయించాల్సిన అవసరం వుండదని గాంధీజీ అభిప్రాయపడేవారు. నిజమే మరి! హింసేలేని రాజ్యములో హింసని ఎదుర్కొనే అవసరమెలా వుంటుంది?



కొల్లు రంగారావు

అనాది నుంచి కూడా భారతీయ సంస్కృతికి హింసకి చాలా దూరం. వివాదాలు తలెత్తితే సామరస్యంగా పరిష్కరించుకోవాలేగాని హింసను ప్రోత్సహించి ప్రభుత్వ ఆస్తులను ధ్వంసం చేస్తే సమస్యలు పరిష్కారం కావు. మన ఇంటికే వచ్చి మనల్ని ఇబ్బందులపాలు చేసిన ఆంగ్లేయుల్ని ఎదుర్కొనడానికి ఎందరో నాయకులు ఎన్నో విధానాలను అనుసరించినా గాంధీజీ మాత్రం వారి ఆస్తులను ధ్వంసం చేయకుండా తన సత్యాగ్రహం ద్వారా స్వాతంత్ర్యాన్ని సంపాదించగలిగాడు. నేడు కొందరు స్వార్థపరులు తమ స్వంత లాభాల కోసం లేని సమస్యలను సృష్టించి మన ఆస్తులను ధ్వంసం చేస్తూ, నిత్య జీవితంలో భయంకరమైన అశాంతిపూరిత వాతావరణాన్ని సృష్టించబూనుకోవడం దురదృష్టకరమైన విషయం. ఇంతకన్న దేశద్రోహం మరేముంటుంది?

ప్రతివ్యక్తి సుఖప్రదమైన జీవితాన్ని కోరుకుంటాడే తప్ప ప్రపంచాన్ని బూడిదగా మార్చాలని కోరుకోడు. ఏ వ్యక్తైనా ప్రాథమికంగా శాంతి, భద్రత, స్వేచ్ఛ ఇంకా ఆస్తులను కోరుకుంటాడు. యుద్ధ వాతావరణంలో ఇవన్నీ నాశనమైపోయేవే. యుద్ధంవల్ల జరిగే మేలుకన్న కీడే ఎక్కువ. ఈ నిజాన్ని గుర్తించగలిగితే ధన, ప్రాణ, మాన నష్టాలను తగ్గించ గలిగిన వారమవుతాం. హింసను అహింసతో ఎదుర్కోవడం చాలా గొప్ప విషయం. ఎంతో మంది తిన తిండి లేక, కట్టుకోడానికి బట్టలేక వుండటానికి ఇల్లులేక దిక్కుతోచని పరిస్థితులలో వుండగా కొన్ని దేశాలు భయంకరమైన పరిస్థితిని సృష్టించడం మానవతా వాదులందరు గర్హించాల్సిన విషయం. హింసను హింసతో ఎదిరించడమంటే రక్తాన్ని ప్రవహింపచేసి జాతిని నాశనం చేయడంతప్ప మరేమవుతుంది?

ముక్కు సూటిగా నిజాయితీగా పోవడం గాంధేయవాదం. ఇది చాలా ఆదర్శవంతమైనదే అయినప్పటికి ఆచరణలో మాత్రం ఎన్నో ఇబ్బందులతో కూడుకున్నదే. గాంధీజీ అహింసా సిద్ధాంతం ప్రకారం నైతిక విలువలు రాజకీయాలలో దారి చూపే దివ్యజ్యోతులు.

సత్యంయొక్క ఆదర్శం ఎంతో వున్నతమైనది. కొన్ని సందర్భాలలో దీన్ని సాధించడం చాలా కష్టతరమైనది. గాంధీజీ మాత్రం తన అచంచలమైన విశ్వాసంతో దీన్ని సాధించగలిగాడు.

గాంధీజీ అనుసరించిన అహింసా విధానం మన మునులు పాటించిందే అయినా, గాంధీజీ పాటించినదాంట్లో విశేషణవుంది. అహింస ద్వారా గాంధీజీ నిర్భయత్వాన్ని పెంపొందించుకోగలిగాడు. నిర్భయుడైతేనే తప్ప ఏ వ్యక్తి కూడా హింసకు దారితీసే తనలోని స్వార్థాన్ని చంపుకోలేడు. అహింసకు దారిచూపే త్యాగాన్ని అలవరచుకోని తాను అనుకున్నది సాధించలేడు. హింసను తలపెట్టే వ్యక్తికన్న అహింసావాది నిర్భయంగా వుండగలగాలి.

మహాత్ముని అహింసా మార్గం మనకి స్వాతంత్ర్యాన్ని సంపాదించి పెట్టడమే గాక ప్రపంచంలోని ఇతర దేశాల ప్రముఖులను కూడా విశేషంగా ప్రభావితం చేయగలిగింది. అమెరికాలో అప్పటి నీగ్రో నాయకుడు మార్టిన్ లూథర్‌కింగ్ గాంధీజీ అహింసా మార్గాన్ని ఆదర్శంగా ఎంచుకున్నాడు. అమెరికాలో నీగ్రోలు తెల్లవారిచే అన్ని రకాలుగా అణగద్రొక్కబడే వారు. చివరకు సాంఘిక జీవితంలో ప్రేమ, అహింసల ప్రాధాన్యతల్ని తెలుసుకున్న అతణ్ణి మార్క్సిజం, లెనినిజం, కన్నా మహాత్ముని అహింసనే ఎక్కువగా ఆకర్షించగలిగింది.

ఈనాటి జాతీయ సమైక్యతైనా, అంతర్జాతీయ సమైక్యతైనా మహాత్ముని అహింసా సిద్ధాంతంపైననే ఆధారపడి వున్నాయి. ఆధునిక ప్రపంచంలో మనం నిజమైన ప్రగతిని ఆశించేవారమైతే యుద్ధాన్ని గురించి గాక శాంతిని గురించి ఆలోచించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

మానవ సంతోషానికి సంపద ఒక్కటే సరైనదికాదు. పారిశ్రామిక జీవనం ఉద్రిక్తతని పెంచుతుంది. దీనిని డబ్బుతో తొలగించగలమా? నేటి పోటీ ప్రపంచంలో డబ్బు ఆనందాలమూలంగా మానవుడు తన ఆత్మను కోల్పోతున్నాడంటే అతిశయోక్తికాదు. నైతికంగా బలంగావున్నప్పుడే ఎన్ని

సమస్యలున్నా మానవుడు ప్రశాంతంగా జీవితం కొనసాగించగలడు.

మన జీవితానికి మూలాధారమైన అహింసా సిద్ధాంతాన్ని అనుసరించినచో ఏ వ్యక్తైనా తన మానాన్ని, మతాన్ని, ఆత్మను సంరక్షించుకోడానికిగాను- అధర్మ బద్ధమైన ఒక సామ్రాజ్యం యొక్క బలసర్వస్వంనైనా ఎదుర్కొని, ఆ సామ్రాజ్యం యొక్క పతనమునకో లేక పునరుజ్జీవనమునకో పునాది వేయుట సుసాధ్యం కాగలదని చెప్పవచ్చును.

మొదటి ప్రపంచ యుద్ధం, రెండవ ప్రపంచ యుద్ధంల వల్ల అపారమైన జన నష్టం, అంతులేని ఆస్తినష్టం జరిగాయి. అభివృద్ధి దెబ్బతింది. వివిధ దేశాల మధ్య సత్సంబంధాలు నెలకొల్పి నష్టాలను అరికట్టి సమైక్యతతో జీవించాలనే ఆలోచనతో స్థాపించబడిన నానాజాతిసమితి, ఐక్యరాజ్యసమితుల భావాల్లో చాలా వరకు గాంధీజీ అహింసా మార్గానికి చాలా దగ్గరగా వుంటాయన్నది సుస్పష్టం.

మనతొలి ప్రధాని నెహ్రూజీ ప్రవేశ పెట్టిన అలీన విధానానికి మూలం మహాత్ముని అహింసనే. చిన్న చిన్న దేశాల మధ్య అభివృద్ధి చెందుతున్న దేశాల మధ్య ఐక్యత పరస్పర అవగాహన, సహకారం లేకుంటే అభివృద్ధి సాధ్యం కాదు. చిన్న దేశాల అభివృద్ధి, అభివృద్ధి చెందిన దేశాల చిత్త శుద్ధిపై ఆధారపడుంటుంది.

ప్రపంచంలోని ప్రజలు సక్రమంగా నడచుకోక అహింస, సత్యం, భగవంతుని గొప్పతనం గుర్తించక పోతే ప్రపంచ విధ్వంసం ఎంతో దూరంలో లేదు. ప్రపంచంలో శాంతి స్థాపనకు సరైన మార్గం అహింస. అహింస, సత్యాలు రాజకీయ జీవితంలో కష్టసాధ్యాలే. కాని గాంధీజీని ఆదర్శంగా తీసుకునే వారికి మాత్రం ఎటువంటి ఇబ్బంది వుండదు.

దినదినానికి అభివృద్ధి చెందుతున్న విజ్ఞాన శాస్త్రం ప్రతి వ్యక్తిని శాంతియుత మార్గంలో సుఖంగా జీవించడానికి వుపయోగపడాలే తప్ప ఆయుధాలతోమారణహోమాన్నిసృష్టించడానికి వుపయోగపడరాదు. ఒక మతానికీ మరో మతానికి మధ్య కల్లోలాలు చెలరేగి హింసకు

పూనుకుంటే అదివారి దౌర్జన్యాన్ని, అమానుషత్వాన్ని ప్రతిబింబిస్తుందే తప్ప నాగరికతను సూచించదు. ప్రపంచనాగరికత స్థాయి పడిపోకుండా కాపాడటానికి ఒక వ్యక్తే కాదు అవసరమైతే ఒక దేశమే తనను తాను త్యాగం చేసుకోవాల్సి వుంటుంది.

అహింసను ఆయుధంగా చేపట్టి మానవ జాతికి మహోన్నతమైన సేవ చేశాడు గాంధీజీ. ఎన్నో క్లిష్టమైన సమస్యలతో నిండివున్న నేటి ప్రపంచంలో అహింసా మార్గం నష్టంలేనిది - ఖర్చులేనిది కూడాను. ఆ అహింస లేదా గాంధేయ వాదాన్ని అనుసరించి సమసమాజాన్ని స్థాపించి ప్రజలందరిని సుఖశాంతులతో జీవింపచేయువలసి బాధ్యత ప్రజా ప్రతినిధులపై వుంది. అందుకు పూర్తిగా సహకరించి విశ్వశాంతి స్థాపనకు పాటుపడవలసిన బాధ్యత ప్రతి పౌరునిపైవుంది. అందుకు పూర్తిగా సహక రించి విశ్వశాంతి స్థాపనకు పాటుపడవలసిన బాధ్యత ప్రతి పౌరునిపై ప్రత్యేకించి ప్రతి విద్యావంతునిపై వుంది.

(**23-5-1984**, యువవాణి, హైదరాబాదు)

# మితమే హితం

అతను మధురగాయకుడే కావచ్చు గాక! అతని గానం విని పరవశించి ప్రశంసించే శ్రోతలు కోట్లమంది ఉండవచ్చు గాక! అభినవ గాన గంధర్వుడని ప్రజల గుండెల్లో స్థిరనివాసం ఉండవచ్చుగాక! అంత మాత్రాన రోజుకి ఇరవై నాలుగు గంటలు భార్య ముందు, పిల్లల ముందు పాడిన పాటలే పాడుతుంటే ఆ కుటుంబ సభ్యుల పరిస్థితి ఎలా ఉంటుంది?

ఆమె ఉత్తమ వక్త కావచ్చుగాక! ఆమె చెప్పే ప్రతి మాట లక్షలాది నిరాశాపరులను చైతన్య వంతులను చేసి ఉండవచ్చుగాక. పేదల పాలిటి పెన్నిధిగానో, దారి చూపే దివ్యశక్తిగానో ఎందరి గుండెల్లో కృతజ్ఞత, గౌరవాలు నిండివున్నా మరొక విషయం లేనట్లు చెప్పిన విషయాన్నే ప్రతిసారి చెబుతూ పోతే వినేవారి పరిస్థితి ఎలా ఉంటుంది?

ఇంటా, బయటా సమాజంలో మరెక్కడైనా సందర్భసహితంగా ప్రవర్తించడం అతి కొద్ది మందికే చేతనవుతుందనడానికి పైరెండు విషయాలు చిన్న ఉదాహరణలు మాత్రమే.

అభినందన సభలు, లేదంటే సన్మాన సభలు మనకు కొత్తకాదు. సభాధ్యక్షుడు, ముఖ్య అతిథి, ప్రత్యేక ఆహ్వానితులతో పాటు అభినందనీయుడు వేదికపై ఆసీనులవడంతోనే ఎవరికి వారు తనను మినహాయించి యావత్ ప్రపంచాన్ని మరచిపోతారనడానికి వారు చేసే ఉపన్యాసాలే నిదర్శనాలుగా భావించవచ్చు. ఎన్నో సభలు అభినందనీయుణ్ణి, లేదంటే సన్మానితుణ్ణి పూర్తిగా నిర్లక్ష్యం చేసినట్లే (ఖచ్చితంగా చెప్పాలంటే, సన్మాన సభ పేరుతో అవమానించినట్లు) కనిపిస్తుంటాయి. అందుక్కారణం ఎవరికి వారు తన గురించి, తనలో లేని గొప్పతనాలు తానే ఆపాదించుకొని మాట్లాడటం, సభికులకు చిరపరిచయమైన విషయాలే! అందుకే చాలామందికి సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాలకు హాజరవ్వాలనే ఆసక్తి వున్నప్పటికీ, మైకు

# నల్లబల్ల సుద్దముక్క

విద్యలేనివాడు వింత పశువు! అదెప్పటి మాటో... విద్యవుండి కూడా వివేకం పెంచుకోక మోసంతో సహవాసంచేస్తూ తాము వింత పశువుల్లా ప్రవర్తిస్తూ తోటి వార్ని బలిపశువుల్ని చేసేవారి సంఖ్య రోజు రోజుకి పెరిగి పోతుంది. సరైన మార్గదర్శకత్వం లోపించి మంచిని గ్రహించే స్థితిలోలేని వారు చదువుకునే బదులు చదువు కొనేందుకు ప్రయత్నిస్తూ చదువుని సంతలో సరుకు స్థాయికి దిగ జారుస్తున్నారు. చదువుల తల్లి సరస్వతిని నరక యాతనకు గురి చేస్తున్నారు.

ఏదైనా వ్యవస్థ పటిష్టంగా పనిచేయడానికి తగిన నియమనిబంధనలు తప్పనిసరి! ముఖ్యంగా విద్యారంగంలో వీటిని పాటించడం ఎంతో ముఖ్యం. అందుకే పాఠశాల స్థాయినుంచి విశ్వవిద్యాలయ స్థాయి వరకు విద్యార్థి పలు పరీక్షల్ని ఎదుర్కోవలసి వుంటుంది. బాధ్యత గుర్తెరిగిన తల్లి దండ్రుల పెంపకంలో, వృత్తికి అంకితమైన అధ్యాపకుల బోధనలో, విద్యపట్ల శ్రద్ధా సక్తులు కలిగిన విద్యార్థులకు ఏ పరీక్షలైనా నల్లేరు మీద బండి నడకే! పట్టు దలతో శ్రమించి జీవితంలో అంచెలంచలుగా అభివృద్ధి చెంది ఉన్నత శిఖరాలకు చేరాలనే లక్ష్యం వున్న యువతరానికి ఇంటి వాతావరణం, పాఠశాల వాతావరణం, సమాజ వాతావరణం- మూడుచోట్లా అను కూలంగా వుండాలి. పాఠశాల స్థాయివరకు ఎలా వున్నా కళాశాల స్థాయిలో శ్రద్ధ తీసుకుంటే చాలన్నది ఒకప్పటి మాట. పాపాయి ముద్దు ముద్దు మాటలు పూర్తవక ముందే మూడో ఏటనే రెసిడెన్షియల్ పాఠశాల్లో చేర్పించి తమ బాధ్యత తీరిపోయినట్లు భావించే తల్లిదండ్రులు కొందరైతే నర్సరీ నుంచి తమ పిల్లల చదువుకి మించింది మరొకటి లేదనట్లు భావించే తల్లిదండ్రులు కొందరు వృత్తి వ్యాపారాలను సరిగా చూసుకోక, పిల్లల చదువులను శ్రద్ధగా పట్టించుకోక రెంటికి చెడ్డ రేవళ్ళయ్యే వారెందరో.

చాలామందికి అంగీక రించడాన్కి బాధాకర మనిపించినా పరీక్షల్లో కాపీ కొట్టి పాసవ్వాలనే భావం విద్యార్థిలో రావడానికి అధ్యాపకులు, తల్లి

దండ్రులే ముఖ్యకారణం. ప్రలోభాలకు లొంగి విద్యార్థి ఉత్తీర్ణత లేదంటే అత్యధిక మార్కుల్ని దృష్టిలో పెట్టుకొని కాపీలను ప్రోత్సహించే అధ్యాపకులు, ఏదో ఒకలా తమ పిల్లలు పరీక్షల్లో ఉత్తీర్ణత సాధించాలనుకునే తల్లిదండ్రులు విద్యార్థుల్ని కాపీవైపు మళ్ళిస్తున్నారు. కాపీ చేస్తూ ఇన్విజిలేటర్లకో, తనిఖీ సిబ్బందికో దొరికిపోయి భవిష్యత్తుని నాశనం చేసుకున్న చిన్నారులెందరో. అతికొద్ది మంది జరిగిన ఘోరాలనుండి గుణపాఠం నేర్చుకొని ఉజ్వల భవిష్యత్తుకి శ్రీకారం చుట్టుకున్న వారూ లేక పోలేదు. కట్టుదిట్టమైన ఏర్పాట్ల మధ్య పరీక్షలు జరిగే కేంద్రాల్లో పరీక్షను వ్రాయక పోయిన వారుండటం గమనార్హం.

ఆంధ్రప్రదేశ్‌లో **1970** నుండి పాఠశాల స్థాయిలో **7,10** తరగతులకి మిగతా తరగతులకి నూటికి డెబ్బైఐదు శాతం హాజరుంటే పాసనే విధానం విద్యార్థుల పురోగతికి అడ్డంకిగానే నిలచింది. ఆరు తరగతులు పూర్తిచేసిన విద్యార్థి ఏడో తరగతి కామన్ పరీక్షలో ఏదో ఒక రకంగా గట్టెక్కేందుకే అత్యధిక ప్రాధన్యత ఇస్తున్నాడు. తల్లి దండ్రుల ఆరాటం అంతే వుంది. పదో తరగతి పబ్లిక్ పరీక్షను కూడా పాస్ దృష్టితో తప్ప విద్యార్జనపై దృష్టి కొరవడుతోంది. ప్రభుత్వ ఎన్ని కట్టు దిట్టమైన చర్యలు తీసుకుంటున్నా వ్యక్తుల స్వార్థం ముందడుగేస్తూ పరీక్షల నిర్వహణలో పలు అవకతవకలు చోటు చేసుకుంటున్నాయన్నది నిర్వివాదాంశం. ఈ అవకతవకలు తమ వ్యక్తిత్వానికి మచ్చలుగా మిగిలిపోతాయని తెలిసికూడా స్వార్థపు ఉచ్చులో చిక్కుకుంటున్నారు. పై అధికార్లు చిత్తశుద్ధితో వ్యవహరించినపుడు అవకతవకలను ఖచ్చితంగా అరికట్ట గలుగుతారు. ప్రతి స్థాయిలో ప్రతివ్యక్తి నీతి నియమాలకు ప్రాముఖ్యత నిచ్చినపుడు అవకతవకలు వ్యాపించడమటుంచి మొదలయ్యేందుకే అవకాశం వుండదు కదా. తరగతిగదిలో సరస్వతి అర్హుల పాలిట వరమై అభ్యుదయానికి బాటలు వేస్తుంది కూడా.

నల్లబల్ల సుద్దముక్కనగానే తరగతి గది, గదిలోని బల్లలు, గోడకున్న నల్లబల్ల, సుద్దముక్కతో వ్రాస్తూ బోధన సాగించే అధ్యాపకుడు, అతని

ఎదురుగా శ్రద్ధగా వినే కొన్ని జతల చెవులు, నల్లబల్లపై కన్పించే అక్షరాలను శ్రద్ధగా వెంటాడే కొన్ని జతల చూపులు... పిల్లల కొంటె ప్రశ్నలు ఏవేవో గుర్తొస్తుంటాయి కదా!

నలుపు అజ్ఞానానికి గుర్తు! తెలుపు కాంతికి సంకేతం! నలుపుని తొలగించి తెలుపుని అందించేవాడు అధ్యాపకుడు అందుకునే వాడు విద్యార్థి ప్రతిక్షణం ఇవ్వడమే తన ధర్మమనుకునే అధ్యాపకుడు ఇవ్వగలిగేందుకు ఎంతో శ్రమించాల్సి వుంటుంది. తనను తాను స్వయం సంపన్నునిగా తీర్చిదిద్దుకోవాల్సి వుంటుంది. తమ విషయ పరిజ్ఞానంలో తమ పంక్చువాలిటీలో, తమ బోధనలో ఎన్నో జాగ్రత్తలు పాటించవలసి వుంటుంది. ఉత్తమ విద్యార్థికి, ఉత్తమ అధ్యాపకుడెంతో శ్రమించవలసి వుంటుంది.

కాని, పీరియడ్ పూర్తియ్యేవరకు బ్లాక్ బోర్డుని తప్ప విద్యార్థుల వైపు చూడని వారు-

ఓ చేత కాగితాలు పట్టుకొని వివరణకు బదులు పాఠ్యాంశాలను బోర్డుపై వ్రాసేవారు-

తామేమి చెబుతుంది తమకే తెలియని వారు విద్యార్థులు అడిగిన ప్రశ్నలకు తగిన సమాధానాలు కాక ఏమిటేమిటో చెప్ప జూచేవారు - విద్యార్థులను ఆకర్షింప గలరా? విద్యార్థుల విద్యావసరాలు పట్టించుకోగలరా?

కొందరు బోధనలో బాగుండి కూడా, మద్యనిషేదం అమలుండి సైతం, గతంరోజు మత్తు వదలక పిల్లల దృష్టిలో చులకనవుతుంటారు.

క్లాసులో ఎందరున్నా ఒక్కరిద్దరు పిల్లలు పాఠం వినక అల్లరి చేస్తున్నారంటే అది పిల్లల తప్పుగాని ఒకరిద్దరు పిల్లలు మాత్రమే బలవంతంగా వింటూ మిగతా పిల్ల లందరూ అల్లరి చేస్తున్నారంటే అది నిస్సందేహంగా అధ్యాపకుడి లోపమే అవుతుంది. ఫలితంగా ఆయా సబ్జెక్టులో అధ్యాపకుని బోధన లేక, తాము స్వయంగా కృషి చెయ్యక విద్యార్థులు

ఆయా సబ్జెక్టులలో వెనుకబడిపోయే ప్రమాదముంది.

అందుకే అధ్యాపకుల్లో చదువరులుగా (అంటే పీరియడ్ మొత్తం వివరణ లేకుండా చదవడం) వ్రాతగాళ్ళుగా, దూకుడుగాళ్ళుగా, ప్రశ్నార్థపు ముఖాలుగా పేరుపొందే వారెందరో!

పాఠ్యపుస్తకాన్ని పఠించి తయారు చేసుకొచ్చిన నోట్స్‌ని ఏ మాత్రం మార్పులేక నల్లబల్లపై సుద్దముక్కతో వ్రాసేవాళ్ళు, గడిచిన క్లాస్ పాఠానికి, నడుస్తున్న క్లాస్ పాఠానికి ఏ సంబంధం లేదన్నట్లు ఎక్కడో మొదలెట్టి మరెక్కడో పూర్తి చేసేవారు, తమను తామే పాఠం మధ్యలో ప్రశ్నించు కుంటూ సమాధానాలను చెప్పలేక పోయేవారు ఎందరెందరో...

సరే, కళ్ళజోడు సవరించుకునే వారు, చొక్కా గుండీలను సరిచేసుకునేవారు, గది కప్పును చూస్తూనో గోడను చూస్తూనో పాఠం అప్పజెప్పినట్లు చేసేవారు... పాఠం చెబుతున్నంత సేపు ఒక్కరిద్దర్ని కాక అందరిపట్ల దృష్టినిలిపి బోధించే అధ్యాపకులు అతి తక్కువ మంది. ఎక్కువ మంది అధ్యాపకుల్లో వారు బోధించే అంశం ఏదైనప్పటికీ విషయానికి సంబంధం లేని ఊతపదాలు విన్పించడమే గాక పిల్లల దృష్టిలో ఆ ఊతపదాలే అధ్యాపకుల నిక్‌నేమ్స్‌గా మిగిలి పోతుంటాయి. మాటకు ముందు యునో, ఎస్.. లాంటి పదాలతో మొదలెట్టే వారు కొందరైతే యాభై నిముషాల పీరియడ్‌లో ఇలాంటి పదాలను నూరుసార్లకు మించి వుపయోగించే వారున్నారనడం అతిశయోక్తిగా విన్పించినా కాదనలేని నిజం.

సహజంగా తెలివైన విద్యార్థులంతా బుద్ధివంతులు కారు. బుద్ధివంతులు అందరూ తెలివైనవారు కారు. తెలివికి బుద్ధి తోడు కానపుడు అతితెలివికే దారితీస్తుంది. అంకిత భావంతో పనిచేసే అధ్యాపకునికి తెలివి, బుద్ధి కలిగిన వారు కావాలనివుంటుంది. బుద్ధివంతులైన విద్యార్థులు తరగతిగదిలో అధ్యాపకుని బోధన శ్రద్ధగా వింటుంటారు. నల్లబల్లపై అధ్యాపకుడు వ్రాసిన అంశాలను నోట్ చేసుకుంటారు. అస్పష్టత వున్న

చోట తగిన ప్రశ్నలు వేసి సమాధానాలు రాబట్టుకుంటారు. పట్టుదలతో శ్రమించి సత్ఫలితాలకు ప్రయత్నిస్తారు.

తెలివికి ఆకతాయితనం తోడైన వారు అసందర్భంగా అల్లరి చేస్తుంటారు. కావాలని క్లాసుకి ఆలస్యంగా రావడమో, అకారణంగా అధ్యాపకునితో వాదనలకు దిగడమో, తోటివారి దృష్టిలో ముఖ్యంగా యువతుల దృష్టిలో హీరోలనిపించుకోవాలని వ్యర్థ ప్రయత్నాలు చేస్తుంటారు. విలువైన సమయాన్ని, తెలివితేటల్ని చేజేతులా నాశనం చేసుకుంటుంటారు.

తరగతి గదంటే అధ్యాపకుడు వ్రాయడానికి వుపయోగించే నల్లబల్ల, పిల్లలు కూర్చునే బల్లలు మాత్రమే కాదు నూటికి నూరుపాళ్ళ ఆసక్తితో తపనతో బోధించే అధ్యాపకుడు, ఎప్పటికప్పుడు కొత్త విషయాలను నేర్చుకోవాలనుకునే తపన కళ్ళలో ప్రతిఫలించే విద్యార్థిలోకంల మధ్య అవినాభావ సంబంధం నెలకొనే పవిత్రమైన చోటు. కాని, నేడు మనకు కనిపిస్తున్న కఠినవాస్తవం? ఎక్కడ పడితే అక్కడ, ఎవరంటే వారు విద్యా సంస్థలు నడిపిస్తున్నతీరు...మధ్యతరగతికి అందనంత ఎత్తుకి ఎదిగిపోయింది విద్య. పట్టాలైతే వస్తున్నాయికాని వాటిలో పట్టెక్కడని నిజాయితీ కలిగిన విద్యావేత్తలు వాపోతున్నారు.

ఏ స్థాయిలోనైనా పెరిగే విద్యాలయాలు విద్యాధికులైన వారి నిరుద్యోగ సమస్యను కొంతవరకు తీరుస్తున్నా యనడంలో సందేహం లేదు. ముఖ్యంగా, విద్య పరమావధి ఆకలిని తీర్చడం మాత్రమే కాదు. ఆకలి తీర్చేందుకు మాత్రమే ఐతే విద్యావికాసం లేని శారీరక శ్రమచాలు ఎక్కడో అతితక్కువ శాతం విద్యాభివృద్ధికి కృషిచేసే వారున్నా ఎక్కువ మంది విద్యాలయాలను కొట్లు రూపంలో మడిగెల రూపంలో నడుపతూ తమ జేబులు నింపుకుంటున్నారు. విద్యార్థిలోకాన్ని దోచుకుంటూ తద్వారా తమని పెంచిపోషించిన సమాజాన్ని తమ దోపిడి విధానాలకు బలిచేస్తున్నారు. సమాజానికే గుండెవంటి దనదగిన విద్యకు తీరని ద్రోహం

చేస్తునారు.

సమాజంలోని ఏ శాఖను తీసుకున్నా ఆ శాఖాభివృద్ధి కేవలం ప్రభుత్వం వల్ల జరిగేదికాదు. ఇదే విషయం విద్యారంగానికీ వర్తిస్తుంది. విద్యాభివృద్ధికి ప్రభుత్వేతర సంస్థలు స్వచ్ఛందసేవా సంస్థలు ముందుకు రావలసిందే. విద్యాభివృద్ధిని పక్కకు పెట్టి అడ్డదార్లలో సంపాదించిన పైకం, పలుకుబడులను విద్యారంగాన్ని శాసించే శక్తులపట్ల సమాజం అప్రమత్తంగా వ్యవహరించాలి. ఆ శక్తులను మొగ్గదశలోనే అణచివేస్తే తప్ప ప్రయోజనం శూన్యం.

ప్రాథమిక స్థాయినుంచి విశ్వవిద్యాలయాల స్థాయి వరకు చూసినా, పసివాళ్ళనుంచి యువతను ఆకర్షించే అధ్యాపకుల సంఖ్య తక్కువే.

కారణం, బాధ్యతల కన్న హక్కులకు ప్రాధాన్యం ఇవ్వడమే. పాఠం చెప్పినా చెప్పకున్నా జీతమొస్తుందని కిందిస్థాయి వాళ్ళు భావించినా, పరిశోధన కొనసాగించినా సాగించ కున్నా పదోన్నతులు కలగక పోవని పైస్థాయి విర్రవీగినా ఎంత వరకు సమంజసం?

అక్షరమే ఆయుధాగారంగా ప్రస్తుతింపబడే నేటి రోజుల్లో ఏ స్థాయిలోనైనా నిర్లక్ష్యాన్ని సహించవలసిందేనా? తక్కువ మార్కులతో డిగ్రీ పొంది అత్యుత్తమ అధ్యాపకులుగా పేరొందిన వారున్నట్లే బంగారు పతకాలు పొందికూడ అధ్యాపకులుగా రాణించలేక పోయినవారుండటం గమనార్హం.

విషయాన్ని ఔపోసన పట్టినట్లు ఇతరుల ముందు గొప్పగా చెప్పుకోవడంకన్న విద్యార్థికా విషయం పట్ల ఆసక్తి కలిగేలా బోధించడం ఉత్తమ అధ్యాపకులు చెయ్యతగిన పని. వారే విద్యార్థులకు అత్యుత్తమ ప్రేరణగా నిలుస్తారు.

తనలోని లోపాలకన్న ఎదుటి వారిలోపాలు తక్కువ సమయంలో ఎక్కువ సంఖ్యలో కనిపిస్తాయంటారు. అధ్యాపకుని విషయంలో ఇది

పూటికి లక్షపాళ్ళ నిజం.

పాఠ్య పుస్తకంలో విషయవివరణ బాగాలేదని, పాతచింతకాయ పచ్చడి కంపులాంటి పాఠ్యాంశాలని, ఎన్నెన్నో లోపాలను ఎత్తి చూపవచ్చు. పూటకో సాకుతో బోధనకు ఎగనామం పెట్టవచ్చు. పై వాళ్ళ అండదండలతో పనికి ద్రోహం చేస్తూనే నాయకులుగా చెలామణికావచ్చు. ఇంకేమేమో చెయ్యవచ్చు అయితే ఇవన్నీ పరోక్షంగా విద్యార్థి లోకంలో అశాంతికి ఆజ్యంపోస్తాయని ఎంతమంది అధ్యాపకులు సీరియస్‌గా ఆలోచిస్తున్నారు? పాఠశాలలో భిన్నదశలువున్నా కళాశాలల్లో తరగతి గదుల్లో వుండాల్సిన విద్యార్థి వరండాల్లో తిరుగుతున్నా పట్టణం సెంటర్లో తిరుగుతున్నా అందుకు ఆ విద్యార్థి నిర్లక్ష్యం కన్నా అధ్యాపకుడి అసమర్థతే కారణమనాలి. నిరంతరం తాను ఒక విద్యార్థినే అనేభావం జ్ఞానార్జనలో చూపితేనే అధ్యాపకుడు విద్యార్థిలోకం మెప్పు పొందగలుగుతాడు. తనను పోషించే సమాజరుణం తీర్చుకోగలుగుతాడు.

గురుశిష్యుల సంబంధాలు మారిపోతున్నాయి. గురువు జ్ఞానవంతుడు కానపుడు శిష్యుడికేమాత్రం జ్ఞానబోధ చెయ్యగలడు? గురువు చెబితే నాటి విద్యార్థి ఆజ్ఞలా భావించేవాడు. విద్యార్థి చెబితే తలవూపాల్సిన దుస్థితి నేటి అధ్యాపకునిది.

సమాజంలోని ఇతర రంగాల మాదిరిగానే విద్యారంగం కూడా అవకతవకలకు మినహాయింపు కాదని ముందే చెప్పుకున్నాం. పదవులకై పరుగుతీసే పెద్దలే విద్యార్థులకు ఆదర్శమవుతున్నారు. అందితే జుట్టు పట్టి నిలవేస్తూ, అందక పోతే కాళ్ళ బేరానికి దిగి అనుకున్నది సాధిస్తున్నారు. ఫలితంగా ప్రతిస్థాయిలో బోధనా ప్రమాణాలు దిగజారుతున్నాయి. క్రమశిక్షణ క్రమక్రమంగా కనుమరుగవుతోంది. నేటి తరం రేపటి తరానికి విద్యారంగంలో అందించగలిగే దేమిటంటే - అత్యధిక ఖర్చుతో కూడుకున్న నిస్సారమైన విద్యని స్పష్టంగా కనిపిస్తోంది.

ఒక విద్యారంగమేమిటి? నేటి వ్యవస్థ వైఫల్యాలమయం అని పెదవివిరిచే వారు లేకపోలేదు. మహానుభావులు ముందు చూపుతో సెలవిచ్చినట్లు ఒక వైద్యుడు అవినీతిపరుడైతే కొందరు రోగులు నష్టపోవచ్చు. ఒక ఇంజనీర్ నిర్లక్ష్యంతో కొన్నిమేడలు కూలో, వంతెనలు పడి పోయో జననష్టం జరుగవచ్చు. కాని ఒక్క అధ్యాపకుని నిర్లక్ష్యంతో అతని చేతి కింది విద్యార్థులు, ఆ విద్యార్థుల కుటుంబాలు కొన్ని తరాల దాకా తద్వారా వ్యవస్థ మొత్తం నష్టపోయే ప్రమాదముంది.

లేచింది మొదలు నిద్రించే దాకా పలు ప్రచార ప్రసార సాధనాల మధ్య క్షణం తీరికలేని జీవితం గడుపుతున్నాము. ప్రతిక్షణం అభద్రతాభవంలో కొట్టుకు పోతున్నాము. ప్రతి మానవుడు అంతకు మించి ఏం చెయ్యగలడను కుంటే ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు సాధించలేరు... వేస్తున్న తప్పటడుగులను సరిదిద్దుకోగలిగి, కొందరికి ప్రేరణకాగలిగినా నల్లబల్లపై సుద్దముక్కలు నిస్సందేహంగా బంగారు భవిష్యత్తునే వ్రాస్తాయి. సుఖశాంతుల జీవితాన్నే ప్రసాదిస్తాయి. అత్యుత్తమ జ్ఞానప్రదాతలుగా అధ్యాపకులు, జ్ఞానార్జనతో తమను తాము తీర్చిదిద్దుకుంటూ జాతి కరదీపికలుగా విద్యార్థులు వెలుగొందాలన్నదే ఆలోచనా పరుల ఆశ, ఆకాంక్ష!

(20-6-96, ఆకాశవాణి, తిరుపతి)

# కొత్తొక వింత

స్కూల్ చదువులు పూర్తయి కాలేజిలో చేరిన తొలి రోజుల్లో టైం కాకముందే తరగతి గదిలో ప్రవేశించి మొదటి బెంచిపై కూర్చునే విద్యార్థి రోజులు గడిచిన కొద్ది క్రమక్రమంగా ఆలస్యానికి అలవాటు పడి గైరు హాజరైనా ఆశ్చర్యపోనక్కర్లేదు.

ఉద్యోగంలో చేరిన తొలిరోజుల్లో చాలా మంది ఆఫీసే లోకంగా భావిస్తుంటారు. పనులన్నీ చకచకా పూర్తి చేసి సీనియర్ల దృష్టిలో ముఖ్యంగా పని చేయని వారి దృష్టిలో వింత జంతువులుగా చెలామణి అవుతుంటారు. ప్రజల పనులను సకాలంలో చేసి పెట్టాలని, కబుర్లకు దూరంగా వుంటూ పలువురికి ఆదర్శం అనదగే విధంగా ముందుకు పోతుంటారు. కాకపోతే కొందరు మాత్రం ఆర్నెల్ల సహవాసంతో వీరు వారవుతున్నారన్న విషయాన్ని అక్షరాలా నిజం చేసి చూపిస్తారు. ఏ సీనియర్లలోని బద్ధకాన్ని, కాలక్షేపం కబుర్లని, అవినీతి పనులను ఇంత కాలం అసహ్యించుకున్నారో వాటినే ఆదరిస్తారు కూడా!

త్రాగుబోతు మాటలు నీటి మీద రాతలని తెలిసినా, ఏదో ఒక మాటకైనా కట్టుబడి వుండక పోతాడా అన్నది అతడి తల్లికో, భార్యకో వుండడం సహజమే కదా! ఎప్పటి కప్పుడు అతను చేసే సరికొత్త వాగ్దానాలను ఓపిగ్గా భరిస్తూ వాటిలో ఏ ఒక్కటి నైనా నిజం చేయమని కనిపించని దేవుళ్ళందరికో పేరు పేరునా మొక్కుకొని, ముడుపులు చెల్లించుకుంటామను కోవడం భారతీయ మహిళకు కొత్తకాదు. ఏ ఒక్కరోజైనా సదరు త్రాగుబోతు త్రాగకుండా సకాలంలో ఇల్లు చేరి పెళ్ళాన్ని ప్రేమగా పలకరించి పిల్లలను ఆప్యాయంగా దగ్గరకు తీసుకుంటే ఆ ఇల్లాలి ఆనందానికి హద్దులు వుండవు. కోల్పోయిన పెన్నిధి నడిచి వచ్చినట్లు దేవుడు మరెక్కడో లేడు...మారిన తన భర్తలోనే అన్నంత తియ్యని అనుభూతి! కాని, త్రాగాలనే కోరిక ముందు వాగ్దానాలైనా, ప్రమాణాలైనా నిలబడేది ఒకటి, రెండు రోజులే. తర్వాత షరామామూలే!

కొత్తగా పదవుల్లోకి వచ్చిన వారి సంగతి.... ముఖ్యంగా రాజకీయ రంగంలోని వారి తీరెలా వుంటుందో అందరికీ తెలిసిన విషయమే! నీతి, నిజాయితీలకు తామే వారసులన్నట్లు న్యాయానికి ధర్మానికి మరోపేరన్నట్లు మంచికి తామే మారు రూపున్నట్టు చెప్పుకుంటూ మధ్య తరగతి మోచేతికి తేనె పూసి నాకిస్తూ, అరచేతిలో స్వర్గం చూపిస్తామంటారు. బాధ్యతలను మరచి ప్రతిక్షణం ప్రజలను మోసం చేస్తూ కేవలం పరస్పరం తిట్లతో, నిందలతో, ఆరోపణలతో కాలక్షేపం చేస్తున్న విషయాన్ని ఎంత మంది గుర్తిస్తున్నారు? ఎప్పటికప్పుడు వారు చేసే కొత్త వాగ్దానాలు అమలు కాని పాత వాగ్దానాలే అని తెలియదా?

( ఆంధ్రపత్రిక, **14-12-1988**)

# ఎక్స్‌ట్రా

జనరంజని మీరు కోరిన తెలుగు సినిమా పాటలు వినేవారికి, పలు ఛానెళ్ళ ద్వారా పలు భాషల్లో టీ.వి. కార్యక్రమాలు చూసేవారికి పన్నులు అదనం అనే పదాలు ప్రచారం చేయబడిన వస్తువు ధర చివర వినిపించడం సహజం. అదనం అన్న తెలుగు పదానికి అనువైన ఆంగ్లపదమే ఎక్స్‌ట్రా. అర్జెంటుగా ఫోటోలు కావలసి వచ్చిందొక సారి. నెగటివ్ తీసుకుని ఫోటో స్టూడియోకు వెళ్ళి ఆరు కాపీలు కావాలండి అన్నాను స్టూడియో అతనితో.

‘‘రేపు ఉదయం 10 గం॥లకు వచ్చి తీసుకుని వెళ్ళండి’’.

కాదండి, ఈ రోజు సాయంత్రానికే కావాలి- నా మాటల్లో అభ్యర్థన.

తీసుకోండి, కాని, ఆరు రూపాయలు ఎక్స్‌ట్రా అవుతుందండి. ఎప్పుడైనా మీరు చేసే పని ఒకటే కదండి. ఈ మాత్రం దానికి ఎక్స్‌ట్రా ఛార్జీనా!

మీ యిష్టం. అవసరమైతేనే తీసుకోండి. మేము మిమ్మల్ని బలవంతం చేయము, అని ముఖం వైపు చూసాడు.

నా అవసరం నాకు! అతడు తెలివి తేటలు ఉపయోగించి డబ్బు చేసు కుంటున్నాడన్న మాట! అనుకొని మౌనంగా వుండి పోయాను.

ఏమాలోచించుకున్నావు? అని అడిగాడు అతను. ఏమీ లేదు నా నెగటివ్ నాకు ఇవ్వండి అన్నాను. చిరాగ్గా యిచ్చాడు. మరో స్టూడియోకి వెళ్ళాను.

ఏడు రూపాయలు ఎక్స్‌ట్రా అవుతుంది అన్నాడు అతను. నా అవసరాన్ని అంతా వివరించాక. మొదటి వాడే నయమనిపించింది. రూపాయి తక్కువ చెప్పినందుకు. కాని ఒక్క రూపాయి కోసం ఆత్మాభిమానం చంపుకొని మొదటి స్టూడియో అతని చేతనే పని చేయించు కున్నాను. కడుపులో ప్రేగులు ఆకలిని గుర్తుచేస్తున్నాయి అంటూ అరవ సాగాయి. దగ్గరలో వున్న హోటల్‌కి వెళ్ళాను. హోటల్ అధునాతనంగా

వుంది. ఆహ్లాదంగా వుంది. టిఫిన్‌కు ఆర్డర్ యిచ్చాను. సర్వర్ తెచ్చిన చెట్నీ గిన్నెను చూసి మాత్రం ఎగ్జిబిషన్‌లో పెట్టాలనిపించింది. అంత చిన్నగా వుంది.

మరి కొంచెం చెట్నీ తీసుకుని రా బాబూ అని హిందీలో అన్నాను. రూపాయి ఎక్స్‌ట్రా అవుతుంది సార్. హిందిలోనే సమాధానం ఇచ్చాడు సర్వర్. నాకు ఈ చెట్నీకి రూపాయి ఎక్స్‌ట్రానా? అనిపించినా తెప్పించుకోక తప్పినది కాదు. అది నా అకలి అవసరం మరి! చెప్పాలంటే ఇంకా ఎన్నో వున్నాయి. ఆటోలో వెళ్ళాలన్నా, రిక్షాలోపోవాలనివున్నా, మన అవసరాలను ఆసరగా చేసుకుని ఎక్కువ డబ్బులు వసూలు చేస్తుంటారు వాళ్ళు. అంతేకాదు! మనది రామ రాజ్యమని, సమ సమాజమని ఈ స్వతంత్ర భారత దేశంలో పుట్టి నందుకు ప్రతి ఒక్కరూ గర్వించాలని మనము అనుకుంటాము. కాని లంచాలు పెట్టందే ఆఫీసుల్లో పనులు తొందరగా జరగవు. అందాక ఎందుకు? ఉత్తరమో (రికమండేషన్), దక్షిణమో(డబ్బు), కనీసం ఏదైనా ఒక అదనపు (ఎక్స్‌ట్రా) అర్హత లేక పోతే అర్హతకు తగిన ఉద్యోగం దొరకడం చాలా కష్టం.

(26-9-80, ఆంధ్రపత్రిక)

# మెప్పు

ఏ వ్యక్తి అయినా మెప్పు పొందాలని ఆశించడంలో తప్పు లేదు. కాని, లేని గొప్పతనాన్ని ప్రదర్శించి మెప్పు పొందాలను కోవడం మూర్ఖత్వం అనిపించు కుంటుంది. ఆయా రంగాలలో తాము చేసే మంచి పనుల ద్వారా లభించే మెప్పులు తద్వారా ఆవ్యక్తికి గుర్తింపు లభించడానికి సహాయ పడుతుంటాయి.

నాయకుడు తన మాటలతో గాక, తానే నీతి సూత్రాలు వల్లిస్తాడో వాటినే తు.చ. తప్పకుండా ఆచరించి చూపి ప్రజల మెప్పును పొందగలగాలి. విద్యార్థి తన అతి వినయంతో గాక విజ్ఞాన ప్రతిభతో అధ్యాపకుని ఆదరణను సంపాదించగలగాలి.

అధికారంలో వున్న వారిని ఇంద్రునితో చంద్రునితో పోల్చి పొగడుతుంటారు. కొందరు (కవులు ముఖ్యంగా) దాని వల్ల పొగడబడే వ్యక్తి తనను పొగిడిన వ్యక్తిని మెచ్చుకుంటాడేమో గాని, అర్హత లేని వ్యక్తులను పొగడడం మానవత్వం వున్న ఏ వ్యక్తి కూడా సమర్థించలేడు. చేసిన తప్పు పనులు కప్పి వుంచుకుంటూ గొప్పవారుగా చలామణి అవుతుంటారు. కాని అతను సాధించే మెప్పు తాత్కాలికమే అవుతుంది. ఎట్టి పరిస్థితులలోనూ అది శాశ్వతం కాదు. కొంత మంది ప్రజలు నాముందు నిన్ను కించ పరచి మాట్లాడి నా మెప్పును, నేనంటే, నీవంటే గిట్టని మూడవ మనిషి దగ్గర మన ఇద్దర్ని కించ పరుస్తూ అతని మెప్పును పొందేవారున్నారు. ఒకడిని తిడుతూ, మరొకడిని పొగడుతుంటే వచ్చేది నిజమైన మెప్పు కానేరదు. ఏ రంగంలోనైనా ఎదుటి వ్యక్తి గొప్పతనాన్ని ఎప్పుడైతే గుర్తించ గలమో అప్పుడే మనలోని గొప్పతనాన్ని కూడా అతడు గుర్తించడానికి అవకాశం వుంటుంది. అప్పుడే నిజమైన మెప్పుకు బీజం నాటిన వాళ్ళం మనం కాగలుగుతాము.

మన తోటల్లో మల్లె మొక్కల్ని నాటితే మల్లె పూలే పూస్తాయి. పిచ్చి మొక్కలు నాటితే పిచ్చి పూలే పూస్తాయి. అలాగే మనుషుల విషయంలోనూ

మన ఆలోచనలు సక్రమంగా వుంటే ఎదుటి వారి ఆలోచనలు కూడా సవ్యంగా నే వుంటాయి అన్న ఆలోచన మన ప్రజలందరిలో వచ్చిన రోజున మెప్పుకి లోటుండదు. మెప్పును సంపాదించడం మన కృషి, చిత్తశుద్ధి మీద ఆధారపడి వుంటుంది. సంపాదించిన మెప్పును నిలబెట్టుకోవడం మన సంస్కారం మీద ఆధారపడి వుంటుంది.

ఒకప్పుడు ఉత్తమ సాహిత్యానికి కృషి చేసి ప్రశంసలకు పాత్రులు అయిన మీరెందుకు శృంగార సాహిత్యానికి ప్రాముఖ్యత యిస్తున్నారు? అని ఏ కవినైనా, రచయిత నైనా అడిగితే పాఠకుల అభిరుచి మారింది. సాహిత్యం బఠానీల కాలక్షేపంగా తయారైంది. అందుకే నేనూ అలాగే వ్రాస్తున్నాను అన్న సమాధానం ఎక్కువ మంది నుంచి వినిపిస్తుంది. నాటి పాఠకుల మెప్పుతో నేడు సాహిత్యాన్ని ధనార్జనకు మార్గంగా ఉపయోగించడం నేరము కాదా? అదే విధంగా మెప్పు కూడా...

( ఆంధ్ర పత్రిక)

# ఇంటర్వ్యూహం

మానవుని అంతరంగంలో దాగిన ఆలోచనలను, జీర్ణించుకున్న విజ్ఞానాన్ని ప్రశ్నిస్తూ సమాధానాలను వెలికితీసి వెలుగు చూపే ఆత్యుత్తమ సాధనం ఇంటర్వ్యూ! పత్రికలు చదివే వారికి, ఆకాశవాణి వినే వారికి, దూరదర్శిని చూసేవారికి ఇంటర్వ్యూలు కొత్తకాదు. పర్వదిన సందర్భాలలో, పత్రికల జన్మదిన సంచికలలో పసందైన ప్రత్యేక ఇంటర్వ్యూలతో పాటు పసలేని ప్రశ్నలు అందుకు పోటీ పడినట్లనిపించే సమాధానాలు మనకు చిరపరిచయాలే!

వైద్యులవ్వాలని నటులైన నటీనటుల వైనాలు, హత్యలు, దోపిడీలు నిత్యకృత్యంగా ప్రజల్ని భయ భ్రాంతుల్ని చేసేవారే అధికార హోదాలో వల్లించే శాంతి మంత్రాలు, నీతి సూత్రాలు పాఠక మహాశయులెందరికో విసుగు పుట్టించేవే.

పలకరించినట్లనిపించి మనసుని పరవశింపజేసినట్లనిపించే ఇంటర్వ్యూలు కొన్నైతే భరించలేని శిక్షగా అనిపించే ఇంటర్వ్యూలు మరికొన్ని! ఇంటర్వ్యూ అనగానే అడిగే వాళ్ళు, అడగ బడేవాళ్ళు కళ్ళ ముందు కదలాడటం సహజం. ఎంతో మందికి తాము హాజరైన ఇంటర్వ్యూల తాలూకు జ్ఞాపకాలు లీలగా గుర్తుకు రావడం, మరెందరికో హాజరవబోయే ఇంటర్వ్యూ భయంగా తోచడం సర్వసామాన్యం.

ఇన్నిన్ని చదువులు, చదువుల కోసం ఎన్నెన్నో తాపత్రయాలు చదువయ్యాక ఏదో ఒక ఉద్యోగమో, వ్యాపారమో చెయ్యాలనే! ఎన్ని అవాంతరాలు ఎదురైనా అనుకున్నది సాధించాలని ముందడుగేసే వారు కొందరైతే, ఉద్యోగమంటే పై అధికారి చెప్పినట్లు వినలేక కింది సిబ్బందితో పనిని రాబట్టలేక అడకత్తెరలో పోకలా నలిగే దుస్థితి ఎదురవుతుందని భావించేవారు లేకపోలేదు. అందుకే వున్న వనరులతో స్వయంవుపాధికి ప్రాధాన్యత ఇచ్చేవారు కొందరైతే ఎప్పటి కప్పుడు ఏదో ఒక రకంగా

బాధ్యతల్ని తప్పించుకు తిరుగుతూ ఉద్యోగం బంగారు గుడ్లు అందిం
బాతుగా చెలామణి చేసేవారున్నారు. ఈ స్థితిలో పెరుగుతున్న
విద్యాలయాలు, విద్యావకాశాలు ఏ మేరకు సంస్కారాన్ని
బోధించగలుగుతున్నాయో సమాధానం చెప్పవలసివస్తే
ఆలోచనాపరులకెంతో బాధ కలిగించే విషయమే కదా!

రెండు శతాబ్దాలపాటు మనల్ని పరిపాలించిన ఆంగ్లేయుల
గుమస్తాలను తయారు చేసే విద్యావిధానాన్ని మనకి వదిలి వెళ్ళారని పల
సందర్భాల్లో మనం పేర్కొంటూ వుంటాం. అందుకే చదివే చదువుల
చేసే వుద్యోగాలకు మధ్యసంబంధం అంతంత మాత్రమే.

మన దేశంలో స్వాతంత్ర్యం వచ్చిన రోజుల్లో చదువుకున్న వా
సంఖ్యా తక్కువైనందున ఏమాత్రం చదువున్న వారైనా తేలికగా వుద్యో
పొందగలిగే వీలుండేది. పెరిగే జనాభాతో విద్యావంతుల సంఖ్యా పెరగడం
సహజంగానే ఉద్యోగాలను ఆశించే వారిమధ్య పోటీ అనివార్యమై
పోయింది. అందుకే ఎంత చిన్న ఉద్యోగానికైనా తగిన విద్యార్హతల
అనుభవం, వృత్తి నైపుణ్యం వగైరాలు అడుగుతున్నారు. ఉద్యోగ స్వభావా
బట్టి వ్రాత పరీక్షలు నిర్వహించి, వ్రాత పరీక్షల్లో మంచి మార్కులు పొంది
వారినే ఇంటర్వ్యూకి పిలవడం జరుగుతోంది. ఇక్కడొక ముఖ్యమై
విషయాన్ని అందరూ గుర్తించాలి - ఉద్యోగాల సంఖ్యా తక్కువ వుం
ఆశించే అభ్యర్థులు అధికంగా వున్నపుడు వ్రాత పరీక్షల ద్వారా కొం
వడపోత తప్పదు. వడపోతలో విజయం పొందినవారిని ఇంటర్వ్యూ చే
అందులో అభ్యర్థులను ఎంపికచేయడం ఎంతో బాధ్యతతో కూడుకున్నది

పద్ధతి ప్రకారం చదివి ఆత్మ విశ్వాసంతో తమ సంతృప్తిమే
ఇంటర్వ్యూ ఎదుర్కోగలిగే వాళ్ళు ఏ రకమైన ఉద్యోగాలకైనా తక్కువ
చెప్పాలి. ఇదే విషయం ఇంటర్వ్యూ చేసే వారికి సైతం వర్తిస్తుంది. బాగా
తయారై వచ్చిన అభ్యర్థిని ఇంటర్వ్యూ చెయ్యాలంటే కమిటీలో వున్న
సభ్యులకు కూడా సరైన విషయ పరిజ్ఞానంతో పాటు సమయోచితంగా

ప్రశ్నించగల నేర్పు చాలా అవసరం. అభ్యర్థి నుండి తగిన సమాధానాలు ఆశించే ఇంటర్వ్యూ కమిటీ సభ్యులున్నట్లే, కమిటి సభ్యులు సహేతుకమైన ప్రశ్నలు వెయ్యాలని అభ్యర్థులు ఆశిస్తారు.

ఉద్యోగ బాధ్యతల్ని బట్టి కొన్నింటికి చురుకుదనం, కొన్నింటికి కరుకుతనం, మరికొన్నింటికి అందచందాలు, వేషభాషలు అవసరమవుతుంటాయి. ఏ ఉద్యోగంలో రాణించాలన్నా పనిపట్ల ఆసక్తివుండాలి. పలురకాల కంపెనీలు ఒకే రకమైన వస్తువును తయారు చేసినా అందులో మేలురకంగా చెలామణీ అయ్యే వస్తువు కుండే ప్రాధాన్యత మాదిరిగా ఇంటర్వ్యూకి హాజరైన వారందరిలో ప్రతిభావంతులకే ప్రథమ తాంబూలం వుండాలి. అలాగని - మండల విలేకరి కాగోరే వ్యక్తికి పద్య పఠనంలో ప్రవేశం వుండనక్కర్లేదు. మండలంతో పాటు ఆ మండలం లోని పల్లె పల్లెకి తిరిగి సమాచారం సేకరించి తప్పుల్లేకుండా వ్రాసి పంపగలిగితే చాలు. పశువుల వైద్యునిగా రాణించేందుకు ఆశుకవిత్వం అవసరం లేదుకదా!

ఏ ఇంటర్వ్యూకైనా హాజరయ్యేవారి సంఖ్య ఉన్న ఉద్యోగాల సంఖ్యకన్న ఎక్కువగానే వుంటున్నందువల్ల ఉద్యోగం దొరికేది కొద్దిమందికే. హాజరైన వారందరికీ ఆ ఉద్యోగం రాకపోయినా ఇంటర్వ్యూ కమిటీ తీరు, వారు ప్రశ్నించిన విధానం అభ్యర్థుల్ని మరో ఇంటర్వ్యూకి బాగా తయారయ్యేందుకు ప్రేరణ ఇవ్వగలగాలి. ఇందు వలన అభ్యర్థులు తమలోని లోటుపాట్లను తొలగించుకునే వీలుంది. అలాకాక అవకాశం వుందికదా అని సందర్భరహితంగా ప్రశ్నిస్తే అభర్థుల నుండి సందర్భరహితమైన సమాధానాలే వచ్చే ప్రమాదం లేక పోలేదు. తామడిగే ప్రశ్నలకు తగిన సమాధానాలు ఆశించే కమిటి సభ్యులు కూడా సహేతుకమైన ప్రశ్నల్ని మాత్రమే అభినందిస్తారన్న విషయం గుర్తించాలి.

ఎవరెంత తెలివైన వారనుకున్నా విజ్ఞానపరంగా, ఆలోచనాత్మకంగా నేర్చుకునేందుకు మార్చుకునేందుకు కొంతమిగిలే వుంటుంది. అందుకే పెద్దలు పలుసందర్భాలలో తెలిసింది పిడికెడని తెలుసుకోవలసింది

ఆకాశమంత మిగిలే వుందని వినమ్రంగా అంటూనే వుంటారు కదా! వచ్చిన చిక్కల్లా మాటలకు చేతలకు మధ్య పొంతన లోపించడమే!

సాధారణంగా పరీక్షలంటే లిఖిత పూర్వకమని, ఇంటర్వ్యూ అంటే మౌఖికమనే భావం ఒకటుంది. రెండు కూడా ఒకదాని కొకటి అవినాభావసంబంధం కలిగి వున్నవే. కాకపోతే వ్రాత పరీక్ష పరోక్ష ప్రక్రియగా మౌఖిక పరీక్ష ప్రత్యక్షంగా జరిగేది. అడిగే వారికి చెప్పేవారు లోకువనే సామెత వున్నప్పటికీ, సరైన రీతిలో ప్రశ్నించలేని వారు, అడగలేని వారు కూడా వ్రాసే వారి దృష్టిలో లేదంటే చెప్పేవారి దృష్టిలో చులకన అనే విషయం మరచిపోరాదు.

విద్యారంగంలోనూ, దీనికి అనుబంధంగా వున్న ఇతర రంగాల్లోనైనా పలుమార్పులు జరుగుతున్న మాట నిజమే ఐనా సాధించాల్సిన లక్ష్యాలకు దూరంగానే వుండి పోతున్నామన్నది తిరుగులేని నిజం. విద్యావంతులైనవారు మేధా సంపత్తిని పెంచుకుంటూ ఆ మేధను సమాజశ్రేయస్సు కోసం వినియోగించాలి. కాని కొందరు మేధావులుగా చెలామణి అవుతూ స్వప్రయోజనాలకు యావత్ జాతిని బలిపశువులుగా చేస్తున్నారు. దీనికి ముఖ్యంగా మన వ్యవస్థలోని లొసుగు లే కారణమని చెప్పాలి. వ్యక్తిలో సంస్కారం పెంచలేని విద్య రాణించడం చాలా కష్టం.

పనిచేసి, చేయించే అధికారమైనా, ప్రశ్నించే అధికారమైనా వ్యక్తిని, వ్యవస్థను మెరుగు పరచడానికే. కాని జరుగుతున్నదేమిటి? ప్రతిదీ మొక్కుబడిగా మారి పోతుందే తప్ప మనసుపడి చేసేవారి సంఖ్య తక్కువైపోతుంది. అధికారముందంటే చాలు పిచ్చికుక్కలతీరుని మరిపించే వారు తరచు కనిపిస్తూనే ఉంటారు. ఫలితంగానే పరీక్షా విధానాలపై అసంతృప్తి, ఆ తర్వాత నిర్వహించే ఇంటర్వ్యూలపై విశ్వాసరాహిత్యం పలు సందర్భాలలో వెలుగులోకి వస్తున్నటికీ మరెన్నో విషయాలు మరుగున పడిపోతున్నాయి.

మేధావి వర్గంలో ఎంత సేపటికీ దేశసౌభాగ్యం కంటే వారి వారి

స్వలాభాలు ప్రముఖ పాత్ర వహిస్తుండటం అత్యంత దురదృష్టకరమైన విషయం. అందుకే కులం పేరుతో మతం పేరుతో కాదంటే మరో పేరుతో ఎదుటి వారిని దెబ్బతీసి పై చేయనిపించుకోవడానికి జరుగుతున్న ప్రయత్నాలను ప్రజలు గమనిస్తూనే వున్నారు.

విద్య ఉద్యోగం కోసమే కాకపోయినప్పటికి ఉద్యోగాల్లో నియమించ బడేవారు తగిన అర్హతలు సేవాభావం కలిగివుండేలా చూడాల్సిన బాధ్యత దేశసౌభాగ్యం కాంక్షించే ప్రతి ఒక్కరిపై వుంది.

**( 2-12-91,** ఆకాశవాణి, నిజామాబాద్)

# అబద్ధం చెప్పడం అంత తేలిక కాదు

నేటి పోటీ ప్రపంచంలోని నిత్యజీవితంలో నిజాలకన్న అబద్ధాలు ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తున్నాయన్నది జగమెరిగిన సత్యం! కుల, మత, వర్ణ, వర్గ విచక్షణ లెంత మాత్రం అబద్ధాలలో కనిపించవు.

శ్రీరామ చంద్రుడు, సత్య హరిశ్చంద్రుడు వంటి అతి కొద్ది మందిని మినహాయిస్తే జీవితంలో కనీసం ఒక్క సారైనా అబద్ధం చెప్పని మానవులు లేరేమో!

అవసరానికో అబద్ధం, ఆపద దాటేందుకో అబద్ధం ఎదుటివారి మెప్పుకోసమో లేని గొప్ప కోసమో అబద్ధం! నిత్య జీవితమనే పలు రంగుల రంగస్థలంపై ఒకరికొకరు ఎంతమాత్రం తీసిపోరనిపించేలా శక్తి వంచన లేకుండా నటించే వారెందరో! ఆమాటకొస్తే అవసరం వున్నా లేకపోయినా అబద్ధాలు చెప్పడమంటే చాలా మందికి నల్లేరుపై బండినడక! అలాగని అందరికీ అబద్ధాలు చెప్పడం అంతతేలికైన విషయం మాత్రం కాదు.

అబద్ధం ఒక మెరుపు తొడుగు. ఆకర్షణీయంగా చెప్పి చెప్పి ఎదుటివారిని నమ్మిస్తుంది, మైమరపింప చేస్తుంది. అప్పుడప్పుడు అపాయాలనుంచి కాపాడే అబద్ధం జీవన విధానమైనపుడు లేని చిక్కులు తెచ్చిపెడుతుందన్నది గమనించవలసిన నిజం.

రవ్వంత నిజంలేని విషయాన్ని వింత వింత వర్ణనలతో కథలు కథలుగా చెప్పేవారిని లేతసొరకాయలు నరుకుతున్నారనడం అందరికీ తెలిసిన విషయమే. కూటిలో రాయి తీసుకోలేనివాడు ఏటిలో రాయిని ఎగిరి తంతా నంటే అతగాడు చెప్పేవిషయాలన్నీ ఎచ్చులుగా భావించడం తెలిసిందే. పై అధికారులు వారి పర్యవేక్షణలో పనిచేసే వారి తాలూకు పలురకాల సంఘటనలు ప్రజలు చిత్ర విచిత్రంగా చెప్పుకోవడం అబద్ధం కాదు.

నవ్వురాని జోక్ వినిపించినా, అసలు వినిపించిందేమిటో ఏమాత్రం అర్థంకాకపోయినా పొట్ట చెక్కలయ్యేలా నవ్వాలి. హాస్యచతురతలో మీకు

మీరే సాటి అనాలి. అప్పుడా అధికారికెంత ఆనందమో కదా! తనకింది వారంతా తననూ, తన చమత్కారాన్ని నూటికి వెయ్యిపాళ్ళు గౌరవిస్తున్నారన్న అపోహ! తన హాస్య చతురతను వేనోళ్ళ కీర్తిస్తున్న భ్రమ! ఆఫీసర్, గుమస్తా హోదాల మధ్య ఎన్ని తేడాలున్నా వ్యక్తిగా ఎవరిగౌరవం వారిదన్నది అందరూ గుర్తించాల్సిన నిజం. తమ బలహీనతలతో దిగజారి దిగజారి తిట్లపాలైన అధికారులున్నట్లే, చేసేది గుమస్తా ఉద్యోగమైనా హుందాగా వ్యవహరిస్తూ ప్రజాభిమానాన్ని చూరగొనే వారెందరో వున్నారు. నిజాన్ని కాదనక అబద్ధాన్ని ఆదరించక పోవడమే ఇందుకు ముఖ్యకారణం.

నిజం ఎంత చేదనిపించినా తుది ఫలితం మధురాతి మధురంగా వుంటుందని, అబద్ధమెంత తీపనిపించినా అంతిమ దశలో అతి దారుణంగా వుంటుందని తెలియనిదెవరికి? కొన్ని మినహాయింపులకు నిజాలైనా అబద్ధాలైనా మినహాయింపు కావన్నది ఎవరి అనుభవం వారికి సవివరంగా తెలియజేస్తూనే వుంటుంది.

వరకట్న మార్కెట్‌లో ఏరికొనుక్కున్న భర్తనైనా, కోరికట్టుకున్న మగడినైనా అతగాడి ఆర్థికస్థాయిని మించి కోరికలు కోరడం వాటిని తక్షణం తీర్చమనడం ఎక్కువ మంది ఇల్లాళ్ళు చేస్తున్న పని. ఆలికి అమ్ముడు పోయిన వాళ్ళుసైతం అత్తమామల స్థాయికి మించి మరెన్నో కోరికలు తీర్చమనడం మామూలైపోయింది.

నిజానికిక్కడ నిజంతో ఏ ఒక్కరికి పనిలేదు. ఎక్కువ సందర్భాలలో నిజం నిష్ఠురమే కదా! అందుకే అందమైన అబద్ధాలతో కొన్నేళ్ళయినా కాలయాపన చెయ్యడమే శ్రేయస్కరం! ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కనీసం స్కూటర్ మీద ఆఫీసు కెళ్ళొస్తే బాగుంటుందన్న కోరికను తెలిపిన అల్లుణ్ణి తమకా తాహతులేదని అత్తమామలు తెలిపితే ఆ అల్లుడి మనసు తెగ బాధపడిపోతుంది. అదే ఏమాత్రం పొగరుబోతైనా 'మీ అమ్మాయిని చేసుకొని ఈలోకాన్నే జయించే అవకాశాన్ని జారవిడుచుకున్నానన్న

మాటలు కూడా వినవలసి రావటమేకాక మరెన్నో అనర్థాలకు గురయ్యే ప్రమాదముంది. అందుకే లౌక్యం తెలిసిన అత్తమామలు అల్లుడితో "నిజం చెప్పాలంటే అమ్మాయి పెళ్ళి మీతో నిశ్చయం కాకముందు నుంచే ఎంత కట్నమిచ్చినా ఓ మాంచి ద్విచక్రవాహనం కూడా కానుకగా ఇస్తే మీరూ అమ్మాయి సినిమాలకు షికార్లకు వెళ్ళడానికెంతో అనుకూలంగా వుంటుందని, అది చూసి మేమెంతో ముచ్చట పడొచ్చని ఆశించాం. కాని..." అంటూ ఎప్పటికప్పుడు ఏదో ఒక ఆర్థిక ఇబ్బందిని ఏకరువు పెట్టగలిగితే చాలు! కొన్నేళ్ళయినా స్థిరాస్థిని అమ్ముకోవలసిన అవసరముకాని, కొత్త అప్పులు చేయాల్సిన దుస్థితి కాని ఏర్పడదు. నోరు మంచిదైతే ఊరుమంచిదవుతుందని పెద్దలు సెలవిచ్చారే గాని ఆ మంచితనం అల్లుళ్ళముందు, వియ్యాల వారి ముందు ఎంత మాత్రం పని చెయ్యదని హెచ్చరించటం మరచిపోయారేమో! నిజంలో నీతి ప్రతిధ్వనిస్తుంది, అబద్ధంలో అవినీతి రాణిస్తుంది. కోరికోనుక్కున్న అల్లుడు కాబట్టి అత్తమామలను పీడించే అలవాటు సహజంగానే ఉంటుంది. అలాంటి అల్లుళ్ళను ఎంత ప్రయత్నించినా ఎన్నికానుకలిచ్చినా ఎవరుమాత్రం సంతృప్తిపరచగలరు? అందుకే ఆర్థిక స్థితిగతులు పూర్తిగా దిగజారక ముందే మాటలతో యుక్తిగా సంతృప్తి పరచాలని అత్తమామలను కోవడం అసహజం ఏమీకాదు.

అగ్నిసాక్షిగా పెళ్ళాడిన భార్యను నీదీ ఒక అందమేనా అని ప్రశ్నించే భర్తను సహించాలంటే ఎంత ఓర్పు, నేర్పున్న మహిళకైనా ఇబ్బందికరమైనదే కట్టు కున్న వాడు వెయ్యికి ఒక్కపాలునచ్చకున్నా మీరు భర్తగా దొరకడం నా అదృష్టమని మురిసిపోయే భార్యకు భర్తనుంచి ఎంతో కొంతైనా ఆదరణ లభిస్తుంది.

ఎవరి పూర్వీకుల గురించి వారు, ఎవరి పిల్లలగురించి వారు ఉన్నవి వున్నట్లు చెబితేనే వినడానికి ఎక్కువగా ఇష్టపడని నేటి రోజుల్లో లేనిగొప్పలు ఉన్నట్లు చెబితే భరించడం కష్టమే. ఆ తరహా గొప్పలను స్వంత

డబ్బాకిందనో, ఎచ్చుల కిందనో జమకట్టడం జరుగుతోంది. యదార్థవాది లోకవిరోధి అని ఏనాడో పెద్దలు చెప్పిన సూక్తిని గుర్తించి అందుకు అనుగుణంగా నడచుకునే వారికి నేటిలోకంలో ఇబ్బందులు తక్కువ!

ఎంత అబద్ధాల కోరుకైనా కారణం ఏదైనప్పటికీ తన అనుకునే భజన బృందమొకటి ఉంటుంది. అధికారం చేతిలో ఉన్నవారి సంగతి సరేసరి. ఎంతైనా మానవ మాత్రులు కాబట్టి కొన్నిమొహమాటాలు, మరికొన్ని బలవంతపు పనులు ఎలాగు వుంటూనే వుంటాయి. లౌక్యాన్ని బాగా వంటపట్టించుకున్న వాడు అనవసరపు మొహమాటాలకి అర్థంలేని భయాలకు మానసికంగా దూరంగానే వుంటాడు. ఈ తరహా నేర్పు వైద్యులకు, న్యాయ వాదులకు ఎంతగానో ఉపయోగపడుతుంది.

ఏ దీర్ఘకాల వ్యాధితోనో బాధపడే రోగికి ఏ వైద్యుని వైద్యమైనా వెనువెంటనే మార్పుచూపలేదు. వైద్యుడు చెప్పే మాటలే ధైర్యాన్నిచ్చేవిగా వుంటాయి. రోగం నయమవదని చెప్పే వైద్యుని దగ్గరకు వెళ్ళేందుకు రోగులు భయపడతారు. అతనెంత మంచి వైద్యుడైనా వైద్యంలో అతని ప్రావీణ్యాన్ని గుర్తించే నేర్పు చాలా తక్కువ మందిలోనే వుంటుంది.

ఏళ్ళ తరబడి కోర్టుల చుట్టూ తిరిగే వారికి తను గెలచితీరాలని మనసులో వుంటుంది. తనవల్ల జరిగింది చెడైనా తనదే మంచి అనిపించు కోవాలనే తాపత్రయం. అందుకు ఎంత ఖర్చయినా చేస్తాడు. న్యాయవాది చెప్పేధైర్యవచనాల్లో కపటం వున్నప్పటికీ నిజమనే నమ్ముతాడు. న్యాయవాదుల వాదనల్లోనే కాక న్యాయమూర్తుల తీర్పుల్లో సైతం అబద్ధాలు రాణించినపుడు వ్యక్తులకు న్యాయంపట్ల, న్యాయవ్యవస్థ పట్ల నమ్మకం కనుమరుగయ్యే ప్రమాదం లేదంటారా? నమ్మకం కరువైన బ్రతుకుల్లో జీవన మాధుర్యం ఎంత వెదికినా కనిపిస్తుందా?

అభినయం అఘోరించినట్లే వున్నా, ఉచ్చారణ సరిగా లేకపోయినా, ఆమాట కొస్తే తన పాత్రకు తనే సంభాషణ చెప్పలేని వారు సైతం నటనకు సరికొత్త భాష్యం చెబుతున్నట్లు, పెదవిపై కొత్త అర్థాలు

పలికిస్తున్నట్టు చెలామణి అవుతున్నారు. సంవత్సరాల తరబడి నృత్యాలు చేస్తున్నా ఏ మాత్రం వన్నె తరగని అందం మీదంటే ఏ నటీమణికి మాత్రం ఒంటిమీద బట్ట నిలుస్తుంది? మీరు పుట్టిందే నటన కోసమని, ఎన్ని జన్మలెత్తినా నటుడిగానే పుడుతుండాలని పొరపాటున అభిమాని ఎవరైనా అంటే - అయ్యా! అందరిలాగే బ్రతుకు తెరువుకోసం ఈ వృత్తిని నమ్ముకున్న వాణ్ణి అన్న నిజాన్ని నిజంగా చెప్పగలిగే నిజాయితీ పరులెందరు? డాక్టర్ కావాలని అనుకోకుండా యాక్టర్ నయ్యానని, ఆఫీసర్ నవ్వాలని కలలు కని, అభినయంలో స్థిరపడిపోయానని లేని గొప్పలు చెప్పుకునే వారే ఎక్కువ. అయినా సరే ప్రేక్షకులు వారిని కూడా ఆదరిస్తున్నారు. ఎందుకంటే సామాన్య మానవుని ఏకైక వినోద కాలక్షేపం సినిమా కావడమే! ఆ సినిమా తాలూకు రంగురంగుల ప్రకటనలు పలు రకాలుగా దర్శనమివ్వడమే!

సినిమా ప్రకటనలకు ఎంతమాత్రం తీసిపోని స్థాయిలో విద్యాసంస్థల ప్రకటనలు, వివాహవేదికల ప్రకటనలు వాటి పనితీరు మనకు చిరపరిచయాలే! నిజానిజాల ప్రసక్తెలావున్నా, ఉన్నత విద్యా ప్రమాణాలతో విద్యార్థినీ విద్యార్థులను అత్యుత్తమ పౌరులుగా తీర్చి దిద్దే సంస్థగా, రాష్ట్రస్థాయిల్లో ఎన్నెన్ని ప్రకటనలో! తల్లి దండ్రులు తమ కొడుకునో, కూతురునో లేదంటే తమకు కాబోయే అల్లుడినో ఏదో ఒక ప్రైవేట్ సంస్థలో చేర్పించే దాకా ఈ ప్రకటనలు నిదురపోనీయవు. ప్రభుత్వ విద్యా సంస్థలు తాము స్వయంగా ఎన్నుకున్న ప్రజా ప్రతినిధుల పర్యవేక్షణలో నడుస్తున్నాయని అర్హతలతో పాటు అంకిత భావంతో పనిచేసే అధ్యాపకులున్నారని, ఏ కారణంగానైనా, వారు తమ సేవలను పిల్లలకు సరిగా అందించకపోతే అవి అందేలా చూడాల్సిన బాధ్యత తమపై కూడా వుందని చాలామందికి తోచదు. వేలకు వేల డబ్బు, విలువైన సమయాన్ని శక్తికి మించి ఖర్చుచేసి తీరా ఫలితం తమకు అనుకూలంగా రాకపోయినపుడే ఆ సంస్థ తాలూకు అబద్ధాలు ఒకటొకటిగా అర్థమవు

తుంటాయి. అప్పుడు ఆకులు పట్టుకున్నా అంతకు ముందు కాలిన తమచేతులు బాగుపడే అవకాశం లేదని గ్రహిస్తారు. అనుకున్న లక్ష్యం నెరవేరకపోగా ఇటుతిరిగి అటుతిరిగి పిల్లల్లో మొదట్లోవున్న క్రమశిక్షణ, పఠనాసక్తి సన్నగిల్లి తల్లి దండ్రులు చెందే ఆవేదన, ఆందోళనలు ప్రకటనల్లో శ్రేణుల కొద్ది అబద్ధాలు కుమ్మరించే వారికి అర్థమవుతాయా?.

శతకోటి దరిద్రాలకు అనంతకోటి వుపాయలు వుండనే వున్నాయి. అందుకే పెద్దగా చదువుకోకపోయినా, వారసత్వంగా సంక్రమించిన ఆస్తి పాస్తులు లేకపోయినా, వారసత్వంగా సంక్రమించిన ఆస్తిపాస్తులు లేక పోయినా డాబు దర్పాలకే మాత్రం లోటు లేకుండా బ్రతికే వారు చాలామంది కనిపిస్తుంటారు. వీరు తమ తెలివితేటల్ని కాదుసుమా అబద్ధాలను పెట్టు బడిగా విలాసవంతమైన జీవితాన్ని రాబడిగా పొందుతూ పలుకుబడి కలవారిగానో, పైరవీ కారులుగానో సమాజంలో గుర్తింపుపొందు తుంటారు. నిజానికి పై స్థాయిలో అధికారైనా, నాయకుడైనా ఎవరూ తెలియకపోయినా తనకెంతో దగ్గరి వాళ్ళన్నట్లు చెప్పుకోవడం, తద్వారా నిజమేనని ప్రజలను నమ్మించడం వీరి ప్రత్యేకత! చక్కదార్లకన్న పక్కదార్లు మేలని నమ్మే వారి సంఖ్య నానాటికి పెరిగిపోతున్న మన సమాజంలో వీరి ప్రాధాన్యత విపరీతంగా పెరిగిపోతుందనేది నిర్వివాదాంశం.

చదివేందుకు, తమ కుమారునికి ఇంజనీరింగ్‌లో సీటు కావాలనో, చదువు పూర్తయినా తమ కుమార్తెకు ఉద్యోగం కావాలనో నిత్యజీవితంలో ఎవరి ఆరాటాలు వారివి. అంతగా మెరిట్ రానివారికి పైరవీకార్లు వర ప్రసాదంగా కన్పిస్తారు. కలుసుకోగానే ఓ కప్పు 'టీ' నో, ఓ కూల్‌డ్రింకో తాగమని అందిస్తే పైరవీకారుల్లోని ఆత్మీయత కొన్నివేల రెట్లు పెరిగినట్లు అనిపిస్తుంది. అంతే! పనిమీద వచ్చిన వాళ్ళకు పైరవీకారు చెప్పిందే వేదంగా తోస్తుంది. ''పైరవీ కారు ఫోన్ నిజంగా పనిచేస్తుందా? పైరవీకారుకి పైవాళ్ళతో నిజంగానే సన్నిహిత సంబంధాలు న్నాయా?

నిజంగానే పనికోసం హైదరాబాదు రమ్మనో ఢిల్లీ రమ్మనో పిలుపు వచ్చిందా''? అనే అనుమానాలు అంత తేలిగ్గారావు. అందుకే పైరవికారు దారి ఖర్చులకని చెప్పినా, పైవాళ్ళని మేపటానికని చెప్పినా అడిగిన మొత్తాన్ని అందించక తప్పదు. పైరవీకారుతో ఆఫీసు కెళ్ళినపుడు ప్యూన్ పెట్టే నమస్కారం, క్రింది స్థాయి ఉద్యోగులు చనువుగా పలకరించే తీరు అంత తేలిగ్గా ఎవరూ అర్థం చేసుకోలేరు, పని పూర్తయితే అదంతా పైరవీ కారు గొప్పతనమే! చేతి డబ్బొదిలి పైరవీకారు ద్వారా పని కానప్పుడు మాత్రమే పైరవీకారు తీరు అర్థమైనా అప్పుడు చెయ్యగలిగేది ఏమీవుండదు.

నేతల ఎన్నికల వాగ్దానాల్లో ఏముంటుందనేది జగమెరిగిన సత్యం! వయసు వేడిలో యువతీయువకులు చెప్పే ప్రేమ, త్యాగం, ఆదర్శాలలో నిజం చాలా తక్కువని గత చరిత్ర సుస్పష్టం చేస్తుంది.

మీరు మీ ఇరుగు పొరుగుని చేస్తున్న ఉద్యోగం ఏమిటని అడిగితే - బ్యాంక్ లోచేస్తున్నాని ఒకరు, కాలేజిలోనో, యూనివర్శిటీలోనో చేస్తున్నట్లు ఇంకొకరు, సెక్రటేరియట్‌లో చేస్తున్నానని, మరొకరు -

ఆ చెప్పే తీరెలా వుంటుందంటే తామే ఆ సంస్థకు అధిపతి అన్న స్థాయిలో వుంటుందితప్ప అసలుసిసలు స్థాయి ఎక్కువ మంది చెప్పకోరు.

అబద్ధాలు చెప్పడం అంత తేలిగ్గాదు అంటూనే ఎన్నిరకాల అబద్ధాలు ఎంత తేలిగ్గా చెప్పొచ్చో చెప్పి ప్రసంగాన్ని పక్కదారి పట్టించాననుకుంటే అది అక్షరాలా అబద్ధమనక తప్పదు. కొన్ని విలువలకు, సిద్ధాంతాలకు కట్టుబడి అబద్ధాలు చెప్పనివారు ఒకవేళ అబద్ధం చెప్పాలని ప్రయత్నించే లోపే ఎదుటివారికి దొరికి పోతుంటారు. ఉన్న అబద్ధాలను అన్నింటినీ ఒక్కసారి వదిలేయమంటే దురాశ అనుకుంటారని తెలుసు. కనీసం రోజుకో ''అబద్ధాన్ని త్యాగం చెయ్యగలిగితే కొన్నాళ్ళకు కాకపోయిన కొన్నేళ్ళతరువాతైనా అబద్ధం చెప్పటం అంత తేలిగ్గాద''ని అంగీ కరించడానికి ఎవరికీ అభ్యంతరం వుండదేమో!

**(7-12-93, ఆకాశవాణి, నిజామాబాద్)**

# డబ్బు

''పైసా.. పైసా.. ఏం చేస్తావ్?''

అంటే - ప్రాణం లాంటి స్నేహితుణ్ణి కూడా పరమ శత్రువుగా మార్చుతాను అన్నదట. ప్రాణ స్నేహితుణ్ణి పరమ శత్రువుగా మార్చే డబ్బు (తన ఆకర్షణతో) పరమ శత్రువుని ప్రాణ మిత్రునిగానూ మార్చేస్తుందటే, మనిషి యాంత్రికంగా జీవిస్తున్న ఈ రోజులలో ఆశ్చర్యపడవలసిన అవసరం ఎంత మాత్రం లేదు. డబ్బు మూలంగా మరో వ్యక్తితో తగవు లాట వచ్చినప్పుడు పాపిష్టి డబ్బుకు ఆశ పడడం మనదే తప్పు అన్న మాటలు (అంటూ వుంటాం) వింటూవుంటాం. డబ్బు పాపిష్టిది కాదు. నడమంత్రపుది కాదు! బంకమన్నును దైవంగానూ, దయ్యంగానూ తీర్చిదిద్దడం జరుగుతుంది. అది అంతా ఆ శిల్పి నైపుణ్యం మీద ఆధారపడి వుంటుంది. అలాగే డబ్బు కూడా! మనం పరుల మేలు కోరి ఖర్చుచేసే ప్రతి పైసా సద్వినియోగం అవుతుంది. పరులకు కీడు చేయాలని ఖర్చుచేసే ప్రతిపైసా దుర్వినియోగం అవడమే కాక మనకే హాని కలిగించ వచ్చు. నాటి నుంచి నేటి వరకు ప్రపంచమంతా డబ్బుతో నడుస్తుంది. డబ్బు ప్రవాహంలో కులమత తారతమ్యాలు అన్నీ కొట్టుకు పోతున్నాయి. మన సమాజంలో ఎక్కువ మంది ఈనాడు మనిషికి వున్న మంచి మనసుని బట్టి గాక. మనిషికి వున్న డబ్బు, హోదాను బట్టి స్నేహం కొనసాగిస్తున్నారు. ఒక్క తల్లి కడుపున పుట్టిన ఇద్దరిలోనే వారికి వున్న అవకాశాలను బట్టి ఒకడు ధనవంతుడై సుఖంగా జీవించ గలుగుతున్నాడు. మరొకడు పేదవాడై బాధితునిగా జీవిస్తున్నాడు. ఇటువంటి సందర్భాలలో ధనవంతునికి పేద వానికి మధ్య ఈ డబ్బు తీవ్రమైన అగాధాన్ని సృష్టిస్తుంది అనే కన్నా అగాధాన్ని సృష్టిస్తున్నది మనిషి అంటే బాగుంటుంది.

ఏ రూపాయి నోటూ - ఏ మనిషితోనూ స్వంత సోదరులను, కన్నవారిని మరచిపొమ్మని చెప్పలేదు.

' ఆర్థిక అసమానతలు తొలగించాలి' అనే నినాదం ఎన్ని సంవత్సరాల నుంచో మన దేశంలో మారుమ్రోగుతున్నా ఆర్థిక అసమానతలు రోజు రోజుకి పెరుగుతున్నాయే కాని తగ్గడం లేదు. అందుకు నిదర్శనం మన రాష్ట్రంలోని ఏ గ్రామాన్ని పరిశీలించినా వెంటనే అర్థమవుతుంది. ఎవరికి ఎక్కువ భూమి, ఎక్కువ డబ్బు, పై అధికారులతో ఎక్కువ పరిచయాలు వుంటే వారే ఈ నాటికి గౌరవింపబడుతున్నారు. పెళ్ళిళ్ళలోనూ డబ్బు ప్రధానమైన పాత్ర వహిస్తుంది. సాధారణంగా ప్రతి అమ్మాయి తండ్రి తనకు కాబోయే అల్లుడు తనకంటే ధనవంతుడు కావాలని కోరుకుంటాడు. ఈ పోటిలలో తట్టుకోలేక మధ్య తరగతి ఆడ పిల్లల తండ్రులు అప్పుల పాలు కావడం జరుగుతుంది. తన స్థోమతకు తగిన అల్లుడిని చూసుకుంటే అప్పుల బాధ అవుతుందిగా! కట్నం కొద్ది కాబోయే అల్లుడు అన్న విషయం మరవనంత వరకూ ఆడ పిల్లల తండ్రులకు విముక్తి లేదు. మనిషి అందులోనూ చదువుకున్న మనిషి స్వార్థానికి మారుపేరు. లేకుంటే సకాలంలో మందులందక ఆస్పత్రిలో రోగులు మరణిస్తారా? న్యాయంకోసం న్యాయ స్థానానికి వెళ్ళిన సామాన్యుడు అన్యాయానికి గురి అవుతాడా? ఎందరో విద్యావంతులు పేదలకు సేవలు చేస్తున్నామని చెప్పుకుంటున్నా రాజధాని వంటి నగరాలలో కొందరు కట్టుకునేందుకు బట్టలు లేక నగ్నంగా తిరుగుతూ, తినే తిండిలేక ఎంగిలి విస్తళ్ళపై వున్న మెతుకులు ఏరుకొని తింటూ, నడిరోడ్డు మీద పడ్డ వర్షపు నీటిని త్రాగుతుంటారా?

మనిషి తన ఉద్యోగాన్ని డబ్బుని సాధనంగా కాక, తన సంస్కారంతో ఒక్క దిక్కులేని వారినైనా ఆదుకోవాలని గ్రహిస్తే ప్రతి ఒక్కరి డబ్బుకు సార్థకత చేకూరినట్లే కదా!

( ఆంధ్రపత్రిక, 1980, దీపావళి సంచిక)

# ప్రచారాలా? గ్రహచారాలా?

రాజకీయాల్లో ప్రవేశించక ముందు, ఆరంగంలో ఏ మాత్రం అనుభవం లేని ఎన్టీ ఆర్ కేవలం తొమ్మిది నెలల వ్యవధిలో ముఖ్యమంత్రి ఎలా కాగలిగారు? అని ప్రశ్నించుకుంటే ఇతర కారణాలు ఏవైనా ప్రధానంగా సాటి లేని మేటి నటునిగా ప్రజలలో ఆయనకు వున్న పేరు ప్రతిష్ఠలు, రాష్ట్రం నలుములలా పర్యటించి ఆయన చేసిన ప్రసంగాలు (పత్రికల్లో ప్రముఖంగా కన్పించడం) అని ఎవరైనా అంగీకరిస్తారు.

నాయకులకైనా, వ్యాపారులకైనా, ప్రచారం ప్రాణంతో సమానం. ప్రచారానికి కరపత్రాల నుంచి కలర్ సినిమాల వరకూ సాధనాలుగా ఎంపిక చేసుకోవచ్చు.

మనకు ఏ మాత్రం పరిచయం లేని పట్టణానికి మనం వెళ్ళినప్పుడు గోడల మీద అందమైన అక్షరాలతో కనిపించేది హోటల్ పేర్లు '' రుచికి - శుచికి హోటల్ 'తృప్తి' లో భుజించండి''. అనే మాటలు ఆ హోటల్‌కు వెళ్ళేలా చేయవచ్చు. తీరా వెళ్ళి ఆనందంగా ఆకలి చల్లార్చుకునేటప్పుడు గాని తెలీదు... సాంబారులో సున్నం వాసన కూడా భరించాల్సి వుంటుందని.

ఇక సినిమాల విషయానికి వస్తే ఒక నిర్మాతకు మరొక నిర్మాత ఎంత మాత్రం తీసిపోడు? చిత్రంలోని ప్రతి పాత్ర ప్రేక్షకులకు వినోదం కలిగిస్తుందనో, హీరోయిన్ నటన చూసి కంట తడి పెట్టని ప్రేక్షకులు లేరనో... ఈ మధ్య ఒకే వారంలో ఇంత పెద్ద మొత్తం వసూలు చేసిన చిత్రం మరొకటి లేదనో, వాల్ పోస్టర్లు అంటించడం. పత్రికలలో పేజీలకు పేజీలు రంగురంగుల్లో ప్రకటించడం... ఇదంతా చాలనట్లు రేడియోలో, టి.వి. లలో ప్రకటించడం. ఇంత ప్రచారం జరిగాక ఆ సినిమా చూడకుండా వుండగలిగే నిగ్రహం ఎంత మందికి వుంటుంది చెప్పండి? ఇక చూసిన వారి విషయమంటారా?... మరెప్పుడూ ఇటువంటి చెత్త సినిమాలు చూడొద్దను కుంటూనే మరొక సినిమాకి తయారవడం నిజం కాదంటారా?

''మీ డబ్బుని అతి తక్కువ కాలంలో రెట్టింపు చేసుకోవా లనుకుంటున్నారా?'' అనే చిట్ ఫండ్స్‌కి ఏ పట్టణం లోనూ లోటులేదు. పెట్టుబడిపై అత్యధిక వడ్డీ, భద్రత కలిపిస్తామని చూపిన వారి హామీలు నీటి మీది రాతలే కాక మన అసలుకే ఎసరని అనుభవంలో తెలుస్తుంది. చేతులు కాలాక ఆకులు పట్టుకున్నా ప్రయోజనం శూన్యమని ముందే జాగ్రత్త పడటం మంచిది కదా?

''దీర్ఘ వ్యాధులచే బాధపడుచున్నారా? మిమ్మల్ని పీడించే జబ్బు ఏదైనా కావచ్చు. ఒక్కసారి మా వైద్యం పొందండి. వారం రోజులలో పూర్తి ఆరోగ్యాన్ని సమకూర్చుకోండి'' ప్రకటనలు నగరాల్లో గోడలపైన, దిన, వార, మాస పత్రికలలో పుష్కలంగా కనిపిస్తూ వుంటాయి. అదే నిజంగా నిజం అయితే దేశం నిండా అయా రంగాల్లో నైపుణ్యం సాధించిన వైద్యులున్నా, రోగాలు నయం కాక చనిపోయే వారు ఎందుకుంటారు?

''మీ అమ్మాయి పెళ్ళి గురించి మీకెందుకు చింత'' మా అభ్యుదయ వివాహ సంఘంలో సభ్యురాలిగా మీ అమ్మాయిలను చేర్పించడనో, మా పత్రికలలో ప్రకటనలు ఇచ్చి మీరు నిశ్చింతగా వుండండి అనే ప్రకటనలు తరచూ చూస్తుంటాం. నానాటికి నైతిక విలువలు పడిపోతున్న ఈ రోజుల్లో వీటి మూలంగా జరిగే లాభం కన్నా నష్టం ఎక్కువగా వుంటుంది.

''మధ్య తరగతి వుద్యోగుల పాలిటి మహావరం - మా సులభ వాయిదా పద్ధతులపై లభించే రేడియో, గడియారం, మిక్సీ వగైరా... వివరాలకు వెంటనే సంప్రదించండి'' అన్నా...''సుశిక్షితులైన అధ్యాపకుల బోధనకు మీ పిల్లలను మా పాఠశాలలోనే చేర్పించండి''. అన్నప్పటికీ, ప్రచారం ఏ రంగానికి సంబంధించినది అయినా ముందుగా ఎంచుకునేది వారి వారి లాభాల సంగతే కాని ప్రజల సౌలభ్యం ఎంత మాత్రం కాదు.

''పురుషలందు పుణ్య పురుషులు వేరయా'' అన్నట్లు ప్రచారాల లోను మనకెంతో మేలు చేసేవి కూడా వున్నాయి. అయితే వాటి సంఖ్య చాలా తక్కువగా వుంటుంది. ఎక్కడైనా మంచి కొంచెమే కదా!

(ఆంధ్ర పత్రిక)



కొల్లు రంగారావు

# కొడవటిగంటి సాహిత్యం సమాజానికి సందేశం

వ్యక్తి స్వేచ్ఛకీ, కుటుంబ గౌరవానికి, సమాజపురోగమనానికి దోహదం చేసే రచనలు చేసిన వారిలో శ్రీ కొడవటిగంటి కుటుంబరావు మొదటి పంక్తిలో నిలుస్తారు. వ్యాసం, కథ, నవల, నవలిక, గల్పిక, నాటిక ఏది వ్రాసినా మనసుకి హత్తుకుపోయే శైలి వీరి ప్రత్యేకత! ఏడు దశాబ్దాల తన జీవితంలో ఐదు దశాబ్దాలు కలాన్ని బలంగా ఉపయోగించి వ్యక్తుల్లోని బలహీనతలపై, కుటుంబాల్లోని లోపాలపై, సమాజంలోని స్త్రీ, పురుష వ్యత్యాసాలపై పోరాటం కొనసాగించారు కొడవటిగంటి.

బ్రతుకు తెరువు రీత్యా దేశంలోని పలుప్రాంతాలు తిరిగిన ఆయన రచనల్లో నాటి సామాజిక స్థితిగతులు, ఆర్థిక మాంద్యం, ప్రపంచ యుద్ధాలను పాత్రోచితంగా ప్రవేశ పెట్టారు. నాటకాలు వెయ్యడంలో, సినిమాలు తియ్యడంలో వున్న ఇబ్బందులను, అంతకు ముందుండే ఉబలాటాలను సజీవంగా చిత్రించారు. వీరు జీవితాల్లోంచి (సృష్టించిన) ఏరుకున్న పాత్రలు నేటికి మన సమాజంలో ముఖ్యంగా మధ్యతరగతి కుటుంబాల్లో కోకొల్లలుగా దర్శనమిస్తాయి. అందుకే వీరి రచనల్లో చదివించే గుణంకన్న మనసుని కదిలించే గుణం అధికమని చెప్పక తప్పదు. స్వాతంత్ర్యానికి పూర్వం, స్వాతంత్ర్యానంతరం స్త్రీ జీవితంలో చెప్పుకోదగ్గ మార్పులేక పోవడంవల్ల ఆయనకు చెప్పలేని ఆవేదన వుంది. అందుకే వీరి రచనల్లో బాల్య వివాహాలు, బాల్య వైధవ్యాలు, వివాహ వైఫల్యాలు, భర్తల దురహంకారాలు, అత్త మామలు, ఆడబిడ్డలు, ఇంకా నిజాయితీగా చెప్పా లంటే నవమాసాలు మోసి కనిపెంచిన తల్లిదండ్రులే స్త్రీకి ద్రోహం చేస్తున్నారన్న విషయం పలు పాత్రల ద్వారా స్పష్టంగా చిత్రించారు. అంతే కాదు ధనం, ఇంధనమైన లోకంలో అదిలేనివారి మానసిక పరిస్థితి ఎంత దారుణంగా వుంటుందో ఆయన తొలిరోజుల్లో వ్రాసిన కథ ' ఇంతలో వుంది' చదివినవారెవరికైనా బోధపడుతుంది. మనసు బాధపడి తేరు తుంది.

''ఒకసారి నోటికి స్వేచ్ఛ ఇచ్చిన తర్వాత అది చాలా దూరం వెళ్ళగలదు'' పై కథలోని నాయికా నాయకుల దురహంకారానికి మచ్చుతునకగా మిగిలిన వాక్యమిది. సంపాదన లేని తమ్ముణ్ణి సైతం చులకన చేసిన నాయిక అతని తిరుగుబాటు ద్వారా తన తప్పేమిటో తెలుసుకుంటుంది. జీవితంలో భార్యా భర్తలైనా అక్కాతమ్ముళ్ళైనా, మరెవరైనా అపార్థాలు పొడసూపి అశాంతి ఎక్కువై జీవితం వ్యర్థం కాక ముందే పరస్పరం తమ తప్పుని తెలుసుకొని జీవితాన్ని తీర్చిదిద్దు కోడం తెలివైన పని అనిపించు కుంటుంది. అదేదో చేతులు కాలకముందే జాగ్రత్త పడగలిగితే మరింత ప్రయోజనంగా వుంటుంది. స్త్రీ స్వేచ్ఛకు ఎన్ని ఆటంకాలున్నది స్వేచ్ఛకథలో కథానాయిక ఒకచోట అన్న మాటలు చాలు.

-''నన్ను ఏదో విధంగా వదిలించుకొని ఒక అయ్యచేతిలో పెట్టడానికి నా అన్నలు ఎంత ఆరాటపడ్డది నేనుమరవలేను. నా భర్తకు ఎంత కట్నం ఇవ్వాలి - అనగా నేను ఎటువంటి భర్తతో కాపరం చెయ్యాలో నా అన్నలు నిర్ధారణ చేశారు. ఆ నిర్ధారణ ఎంత నిశ్చింతగా చేశారో నాకింకా జ్ఞాపకంవుంది. నాకు విచారించిన రెండు సంబంధాల కట్నంలో తేడావచ్చింది. నాకూ, నన్ను పెళ్ళి చేసుకోడానికి అంగీకరించిన కుర్రాడికీ మధ్య అయిదువందల రూపాయలు అడ్డం వచ్చినై. అయిదు వందల రూపాయలకూ నా అదృష్టానికి పోటీ వచ్చింది. నా అదృష్టం ఓడిపోయింది''. దూరపుకొండల నునుపేమిటో ''పట్నవాసం'' కథలో పటాపంచలవుతుంది. ఎన్నాళ్ళనుంచో పట్నం చూడాలని కుతూహలపడిన బైతుమామయ్య తీరా చూసిన తర్వాత '' ఆ .. మనవాళ్ళు ఆత్మహత్య చేసుకునేటందుకు రకరకాల విద్యలు నేరుస్తున్నారంటూ'' తీర్మానిస్తాడు.

ఆడబ్రతుకే మధురం కొడవటిగంటి కథలన్నింట్లోకి చిన్నదైనా ప్రతి ఒక్కరూ చదవాల్సిన కథ. సమాజంలో భార్యల్ని పలురకాల బాధించే భర్తలు ఒక చిన్న పిల్ల మనసులో రాక్షసులుగా నిలచిపోతారు. అలాగే పెళ్ళాం మంచిది కాకపోయినా కృష్ణమూర్తి ఆవిడను కొట్టడు సరికదా

ముద్దు చేస్తాడు. అందుకే ఆ చిన్నపిల్ల ''నేను పెద్దదాన్నయితే కొట్టే మొగుణ్ణి మాత్రం చేసుకోను పుణ్యం లేకపోతే పీడపాయే. ఎవరు పడతారమ్మా దెబ్బలూ, తిట్లూ నూ? పెద్దదాన్నయితే ఎవరికీ తెలీకుండా కృష్ణమూర్తి గార్ని చేసుకుంటాను'' అనడం అసమంజసం అనిపించినా ఆ అనడానికి దారితీసిన పరిస్థితులు తొలిగే దెన్నడు? తిట్లతో దెబ్బలతో భార్యల్ని సాధింపులతో భర్తల్ని జయించలేమని భార్యాభర్తలు గ్రహించగలిగితే అప్పుడు ప్రతిభర్తా ఒక కృష్ణమూర్తే! పరస్పరానురాగంతో అన్యోన్యతను సాధించగలిగితే మరే చిన్నమ్మాయి కూడా ఈ కథలో చిన్నమ్మాయిలా ఆలోచించాల్సిన అవసరం రాదుకదా!

ఏ రచన ఎవరు చేశారన్న దానికన్నా, ఎన్ని హంగులు కురిపించగలిగారనే దానికన్నా అది నిత్యజీవితాన్ని చూటడంలో సఫలమైనదా? లేదా? అన్నది ముఖ్యం. సాహిత్యం, జీవితం వేరువేరుకాదు. విజ్ఞులు సాహిత్యంలో జీవితాన్ని, జీవితంలో సాహిత్యాన్ని చూడగలరు. డబ్బే జీవితం కాదు కాకూడదు. కాని జీవితంలో డబ్బు ప్రధాన పాత్ర వహిస్తుందన్నది కాదనలేని నిజం. బళ్ళు ఓడలవుతే ఆనందమే. ఓడలు బళ్ళయినపుడే భరించే శక్తి కొద్దిమందికే వుంటుంది. చింతచచ్చినా పులుపు చావదనే విషయం వీరి ఓడలు-బళ్ళూ కథలో ప్రకాశరావు పాత్ర స్పష్టం చేస్తుంది. తనే కార్యాలయంలోనైతే చిన్న ఉద్యోగానికి వెళతాడో అక్కడ తనపై అధికారిపై అసూయపడతాడు. అందుక్కారణం అతను తెలిసిన వాడుకావడమే. అందుకే పై అధికారైనా రంగారావుపై ఆఫీసువాళ్ళకి ''మాపొలం చెయ్యటానికొచ్చినప్పుడు రంగారావు తండ్రికి సెంటు పొలం లేదు. పాతికేళ్ళు మా పొలం మీద తెగబలిశాడు. రెండెకరాలు సొంతాన కొనుక్కున్నాడు. ఇవాళ ఈ రంగారావింత గొప్పవాడయినాడంటే మా చలవే'' అంటూ తన గొప్పను చాటుకున్నాడు.

రెండవ ప్రపంచ యుద్ధం కల్పించిన పరిస్థితులవల్ల ఈ ఉద్యోగం తనకి దొరికిందన్న విషయం రంగారావుకి తెలుసు. అందుకే ''ఈ ఉద్యోగ

దొరికినంత మాత్రాన నేను గొప్పవాణ్ణయి పోలేదు. మీరంటే పెద కుటుంబంవారు. ఇవాళ చితికిపోయినా మీగొప్పతనం తగ్గదు. మీరు నాకింద పనిచెయ్యడం నాకేమీ మనస్కరించదు''. అంటూ ప్రకాశరావుని మరో ఉద్యోగం చూసుకోమంటాడు రంగారావు.

''స్వార్థబుద్ధి'' కథనం ఏ కాలానికి అన్వయించుకున్నా సరిపోతుంది. చదువు, శాస్త్రాలు తెలియని రాజు సుఖం మత్తులో మునిగిపోతే మంత్రిచేతిలో అక్షరాలా కీలుబొమ్మ! ఈ కథలోనే ''డబ్బు సంపాదించడం మానవుడి ఆశయం అయినంతకాలమూ కుయుక్తులకూ, లంజరికానికీ, చోరత్వానికీ, సమస్త పాపాలకూ అవకాశం వుండింది. కాని సంపద కుయుక్తులతోను, లంజరికంతోనూ, చౌర్యంతోను పెంపొందేది కాదు. ఇందువల్ల కొంత సత్కార్మ కూడా నశించింది. దాతృత్వమూ, తక్కువ వాళ్ళయందు సమభావమూ వాత్సల్యమూ మొదలైనవి నశించినై. కాని ఈ పుణ్యాలన్నీ మనిషి అహంకారాన్ని తృప్తి పరిచేవేకాని నిజమైన పుణ్యాలు కావనే అభిప్రాయం బుద్ధిమంతులలో మొదటి నుంచీ ఉంటూనే ఉండింది. సజీవ ప్రేతం కథలోనూ డబ్బు మహిమ ఎవరినెంత దూరంలో ఉంచాలో చక్కగా - ఒక విద్యగా - అభ్యసిస్తుంది కథనాయిక. చిన్నప్పుడే చెడు సహవాసాలకు అలవాటైనా ఆమె బ్రతుకు భర్త ఆగ్రహానికి గురవుతుంది. ముందు జాగ్రత్తలేని కారణంగా డబ్బు, తద్వారా వచ్చే సుఖాల్లో మునిగితేలడంతో ఉంచుకున్నవాడి మరణంతో వీధిలో పడింది. కుమార్తె వనజాక్షికి పెళ్ళికాలేదు. ఎంతో గొప్పవాడు చేసుకుంటాడనే ఆశఅటుంచి అసలు పెళ్ళయ్యే ఆశేపోయింది. చివరకు తాగివచ్చి తన్నేవాడి వుంపుడుగత్తె అయింది వనజాక్షి! చేసిన తప్పును వెంటనే తొలగించుకొనే జాగ్రత్తపడక, ఆ తప్పుకి మరోతప్పు వ్యక్తిని కుటుంబాన్ని ఎంత దిగజారుస్తుందో సవివరంగా చెప్పిన కథ సజీవప్రేతం.

ప్రతీక సాహిత్యం కుటుంబరావు ప్రత్యేకత! ప్రఖ్యాత కథకులు డాక్టర్ కేతువిశ్వనాథరెడ్డి మాటల్లో చెప్పాలంటే ''కొడవటిగంటి రాసిన

డిబ్బి కథలు సంకేతాత్మక కథలు. ఆధునిక సామాజిక భావాలను రాజ్య యంత్రాంగ ప్రతీకల ద్వారా ఈ కథల్లో ఆయన చిత్రించారు. దిబ్బ ప్రభువు గారితో ఇంటర్వ్యూ, దిబ్బ రాజుగారి ప్రతిష్ఠ దిబ్బ రాజ్యంలో ప్రజాస్వామికం, దిబ్బవంతం, జాతికుక్కలు, నాటుకుక్కలూ, దిబ్బరాజ్యంలో స్వాతంత్ర్యం, దిబ్బపుట్టుక ఈ సంకేతాలన్ని కొన్ని మూర్త భావాలకు, ఆ మూర్తభావమునకు వెనుక వుండే రచయిత గుండె మంటకూ, మేథో విలసితమైన వ్యంగ వైభవానికీ, వర్గ దృష్టికీ ప్రాతినిధ్యం వహించేవి.

స్వతహాగా సైన్సు పట్ల అభిరుచి కలిగిన కొడవటిగంటి విజ్ఞాన శాస్త్రములోని పలు అంశాలు సరళంగా వివరిస్తూ అనేక వ్యాసాలు, శాస్త్ర విజ్ఞాన కల్పనా కథలు రచించారు. చంద్ర గ్రహంలో గ్రహాంతర యాత్ర, గంధర్వ లోకయాత్ర కథలు ఈ కోవకి చెందినవే. దాదాపు మూడు దశాబ్దాలు చందమామ సంపాదకునిగా బాల సాహిత్య అభివృద్ధికి ఆయన చూపిన శ్రద్ధ వల్లనే ప్రతి సంచికా ఒక ప్రత్యేక సంచికగా రుపొందిన విషయం బాల సాహిత్యాభిమానులకు తెలియని విషయం కాదు.

పలు ఇతివృత్తాలతో అనేక గల్పికలు వ్రాశారు కొడవటిగంటి. అపోహాలు, అనుమానాలు, పరస్త్రీ వ్యామోహాలు, పరపురుష వ్యామోహాలు ఏవైనా కావచ్చు. ముగింపులో తనదైన ప్రత్యేక చురకలంటించాడు కొడవటిగంటి.

మన మనసు చంచలమైతే ఎదుటి వారి మనసు చంచలం కానక్కర్లే దని ''బిడియం'' లో గల్పిక తెలుపుతుంది. ఇందులో శారద ఇరవయ్యేడేళ్ళ శారద పదిహేడేళ్ళ శాస్త్రి తనను ప్రేమిస్తునట్లు అపోహపడుతుంది. ఆ కుర్రాడి స్వర్గసౌఖ్యం తన అరచేతిలో వుండే అది అతని కివ్వడం ఉచితమా కాదా? తన ధర్మమా? కాదా? బి.ఏ. పాసయిన తనకు నిరపాయకరమైన ఒక చిన్న తప్పుచేసే అధికారం ఉందా? లేదా? ఒకవేళ తను ఆ కుర్రాణ్ణి విరహాగ్ని వాతపేసి తను పదహారణాల పాతివ్రత్యం దక్కించుకున్నప్పటికీ ప్రపంచం తన పదహారణాల పాతివ్రత్యంలో విశ్వాసం ఉంచుతుందనే ఆశ

ఉన్నదా? ''ఏమిటి శాస్త్రీ ఏదో అనబోయినావే! నేనేమీ అనుకోను చెప్పు'' అన్నది శారద ప్రోత్సాహకరంగా నవ్వుతూ. అయిదు నిమిషా నుంచి నీళ్ళు నములుతున్న శాస్త్రి ''ఈ నెల ఇంతవరకూ మా నాన్న డబ్బు పంపలేదు. పదిహేను రూపాయలు కావాలి. అడగటానికి సిగ్గుగావుంది' అంటాడు... అవకాశం కోసం అర్రులు చాస్తూ తప్పుచేసే వాళ్ళేకాద అవకాశం వున్నా ఆ ఆలోచనే రాని వారుంటారని చెప్పడానికే పై ప్రస్తావన

రాజకీయంచతుర్వారం, తోలుబొమ్మలు, ప్రజాహృదయం నిప్పులాంటి వాడు, గల్పికలలో పాలకుల, నీతిలేని నేతల తీరు వివరించారు కొడవటిగంటి, ముసలం, పిరికిదయ్యం, బ్రహ్మరాక్షసులు కులంగాడి అంత్యక్రియల్లో కథలు కొడవటిగంటి హాస్య, వ్యంగ్య ధో ణులకు ప్రతీకలుగా నిలుస్తాయి.

కొడవటిగంటి నవలా రచనల్లో భాష, ఇతివృత్తం, శిల్పం నూ నత్వానికి ప్రతీకలుగా నిలుస్తాయి. కొన్నిచోట్ల వ్యాసంలా, వ కొన్నిచోట్ల సుదీర్ఘమైన చర్చలు కన్పిస్తాయి. చదువు నవలను చదివి వారెవ్వరైనా దాని ఆయన ఆత్మకథగానే భావిస్తారు. సంఘంలో అశాంతి ఒకే కారణం దోపిడి. అదే లేనినాడు ఏ ప్రచారమూ అశాంతిని వ్యాప్తి చెయ్యలేదు. దోపిడీ తరగతుల వారీగా జరుగుతుంది. జీవిత సూత్రాన్ని చేతుల్లోకి పట్టుకొని కదిలించలేక దానికి చిక్కిపోయినవాడు ఈ పరిస్థితి నేమీ చేయలేడు. కింది వాణ్ణి దోస్తాడు, పైవాడి చేత దోపిడీ చేయించు కుంటాడు. వాడే కళలూ సృష్టించినా, ఏ రాజకీయాల్లో పాల్గొన్నా, ఆర్థిక సమస్యల్ని గురించి మాట్లాడినా ప్రపంచానికి పిసరంతైనా ఉపయోగంలేదు. జీవిత సూత్రాన్ని చేతబట్టిన వాడు దాన్ని మరింత చిక్కుపరుస్తాడో, చిక్కు విడదీస్తాడో అదివాడి ఆదర్శాలను బట్టి వుంటుంది. వాడు మంచికి పనిచేస్తే వాడివల్ల లోకానికి ఉపకారం వుంది, చెడుకు పనిచేస్తే అపకారం వుంది. వాడి సాంఘిక చైతన్యం గురించి, వాడి రాజకీయం గురించీ వాడు సృష్టించే కళల గురించి ఉదాసీనంగా ఉండటం

బుద్ధిమంతుడి లక్షణం కాదు. అరుణోదయం నవలలో పేరులేని కుర్రాడు చెప్పిన పై మాటల్లోని ఆంతర్యాన్ని ఒకటికి వందసార్లు అర్థం కాలేదంటే మరోసారి ఆలోచించి మనల్ని మనం రక్షించుకునేందుకు తక్షణమే ముందడుగేయాలి. ఆ మార్గంలో ఎదురయ్యే అవాంతరాలను అధిగమించాలి. పంచకళ్యాణి, అనామిక, ఆడజన్మ నవల్లలో స్త్రీ జీవితాన్ని పలుకోణాల్లో చిత్రించారు కొడవటిగంటి. పంచకళ్యాణిలో స్త్రీ పాత్రలు సుశీల, జానకి, లక్ష్మి, తాయారు, లలిత - చదువుకున్నవారే. వీరి ఆశలు, ఆశయాలకు, ప్రేమ భ్రమలాగే మిగిలిపోతుంది. తరతరాలుగా స్త్రీ బానిసల బానిసగా పెరిగింది. ఆడదాన్ని కాళ్ళూ చేతులు కట్టేసి చావ చితకకొట్టి చీకటి కొట్లో వేసి వుంచారు. ఒకవేళ నువ్వు స్వతంత్రురాలవే. పరిగెత్తమంటే సాధ్యమా అని ప్రశ్నిస్తుంది లలిత. ఏ వయస్సులో జరగాల్సిన ముచ్చట ఆ వయసులో జరగనప్పుడు ఏ మనిషికైనా ఎంతో కొంత విసుగు తప్పనిసరి కదా!

తోడై వుంటానని చెప్పినవాడే చులకనగా చూడ్డం మొదలెడితే "ప్రేమ అంటే భ్రమ తప్ప ఇంకేమీ లేదు. సంసార సుఖమే అసహ్యామైన దనే" భావన బలపడిన జానకిలాంటి వాళ్ళు మన సమాజంలో ఎందరో! సుశీల పెళ్ళి కాకుండానే రామకృష్ణతో సంబంధం పెట్టుకుంటుంది. అతను పెళ్ళయిన వాడన్న విషయం సుశీలకు తెలియంది కాదు. తమిద్దరికీ సంబంధం ఏర్పడ్డంలో అతని బాధ్యతకన్న తనదే నిజానికి హెచ్చన్న సంగతి కూడా ఆమె మరచిపోతుంది. ఇద్దరూ పెళ్ళి చేసుకుంటారు. విషయం తెలిసిన రామకృష్ణ భార్య మాటలు "మగవాళ్ళు వచ్చి మీద పడితే ఆడవాళ్ళు కూడా లొంగిపోవలసిందేనా? ఎవతో విడిచేసిన ఆడది తప్ప మగాడిమీద పడదు. మగవాళ్ళట్లా కాదే? పైకి పెద్ద మనుషులల్లే ఉంటూ కూడా సమయం దొరికితే కుక్కలకంటే అన్యాయంగా ప్రవర్తిస్తారు." కొడవటిగంటి మాటలుగానే భావించాలి. చదువులు, ఉద్యోగాలు చేపట్టినా, మరెంత ముందుకు పోయినా స్త్రీ, పురుషుల మధ్య పవిత్ర బంధం

కావలసిన వివాహ బంధం వ్యాపార ఒప్పందాల్లా మారిపోయింది. వరకట్న దాహాలైనా, పర స్త్రీ పురుష వ్యామోహాలైనా నాగరికులమని చెప్పుకునే వారి అనాగరిక చర్యలే! సమాజాన్ని నైతికంగా అనారోగ్యానికి గురిచేసేవే? ఆడజన్మ నవలలో లక్ష్మి నేటికీ సమాజంలో ఎక్కువ కుటుంబాల్లో కన్పించే ఆడపిల్లల ప్రతినిధి. చిన్న వయసులోనే పెళ్లైన లక్ష్మి తల్లి చావుతో తండ్రి ఆదరణకు నోచుకోలేదు. అత్తవారింటా అన్నీ అరళ్ళే. భర్త పక్షవాతానికి గురై మరణించడంతో ఒక్కగానొక్క కూతురు భ్రమర భవిష్యత్తుని తీర్చిదిద్ద లేకపోతుంది. తన కూతురి జీవిత నిర్ణయాలు చేసే శక్తి సామర్థ్యాలు తనకు చాలవని లక్ష్మి గుర్తిస్తుంది. కాలేజీ చదువు చెప్పించినా ఎప్పుడో ఒకప్పుడు పెళ్ళిచేసుకోవలసిందే గాని పిల్ల ఉద్యోగాలు చెయ్యబోదు. ఆడవాళ్ళకు దొరికే ఉద్యోగాలన్నీ అవినీతి కరమైనవనే లక్ష్మి విశ్వాసం. అయితే ఇందుకు భిన్నంగా భ్రమర సినిమా వ్యామోహంలో పట్నం వెళ్ళి సినిమా ప్రొడ్యూసర్ చేతిలో మోసపోయి గర్భిణిగా తిరిగొస్తుంది. ముప్పై మూడేళ్ళ లక్ష్మికి భ్రమర భవిష్యత్తు అయోమయంగా తోస్తుంది. భ్రమరను ఓ కుర్రాడు చేసుకున్నా అది కేవలం ఆస్తికోసమే అనుకుంటుంది. భ్రమర ఒక ఆడపిల్లతో వీధిలో నిలబడుతుందన్న ఆలోచన ఆమెను భగవంతుడా! మాకేది దిక్కని ఏడిపిస్తుంది.

ఇంకా గడ్డురోజులు, బెదిరిన మనుషులు, బ్రతుకు భయం ఇత్యాది నవలల్లో మధ్యతరగతి మనుగడను సమర్థవంతంగా చిత్రించారు కొడవటిగంటి. అశోకవనం, అతీతజ్ఞానం, అమోఘ వచనం కథావస్తువుల్ని ఆధునిక ఇతివృత్తాలుగా తీర్చిదిద్దారు. దాదాపు వంద నాటకాలు వ్రాసిన కొడవటిగంటి వాటిల్లోనూ తనదైన నవ్యతను చూపించారు. మహాకవి, ఉత్తరకిష్కింధ, కర్మయోగులు, పెళ్ళిగొడవ, రంపపుకోత ప్రముఖంగా చెప్పుకోదగ్గవి. కొడవటిగంటి కథకుడిగా, నవలాకర్తగా, నాటక కర్తగా, వ్యాసకర్తగా చెప్పిన విషయాల్లో చాలా వరకు సమాజానికి సందేశాలే. ఆయన రచనల్లో అంతర్లీనంగా కమ్యూనిజం వుందనేది జగమెరిగిన సత్యం.

ఆయన మాటల్లోనే చెప్పాలంటే రచన ఎప్పుడూ జీవితంనుంచి రావల్సిందే గాని సిద్ధాంతాలనుంచి వచ్చే అవకాశం లేదు. కాకపోతే జీవితంలో మనుష్యులు ఎదుర్కొనే నైతిక, ఆధ్యాత్మిక సమస్యలని తాను అర్థం చేసుకోడానికి ఇతరులకి విస్పష్టంగా చెప్పడానికి ఈ రచయిత విశ్వసించే సిద్ధాంతాలు తోడ్పడవచ్చు.

రచనల్లో జీవితసత్యం వ్యక్తం కావాలంటే రచయితకి జీవితం ఎంత బాగా తెలియాలో ఆ జీవితం తాలూకు పరమార్థం కూడా అంత బాగా తెలియాలి. సంఘంలో ప్రతివ్యక్తి అనుక్షణమూ తనకు కావలసిన సత్యంగురించి అన్వేషిస్తాడు. నిరుద్యోగి ఉద్యోగం దొరికేటట్లు, పారిశ్రామికుడు తనకిందవున్న ఉద్యోగుల సంఖ్య తగ్గించేందుకు మార్గాలు చూస్తాడు. ఇవి ఆయావ్యక్తుల జీవితాలను ముందుకు తీసుకుపోతాయి తప్ప సామాజిక జీవితాలను ముందుకు తీసుకుపోయే సత్యాలు కావు. సత్యం అనేది అన్నివర్గాలవారికి నిర్వివాదంగా వినబడాలి. ఆ సత్యం తెలుసుకోవడం వల్ల ప్రతివ్యక్తికీ సమాజస్వరూపాన్ని గురించిన జ్ఞానం విధిగా అభివృద్ధి చెందాలి. ఉత్తమ సాహిత్యానికి శిల్పం, వాస్తవికత, జీవిత సత్యానికి సంబంధించిన ప్రయోజనం అని నమ్మిన కొడవటిగంటి కుటుంబరావు గారి సాహిత్యం సమాజానికి నిత్య సందేశం.

(**13-7-92**, ఆకాశవాణి, నిజామాబాదు.)

# గోపాలకృష్ణగోఖలే

మహారాష్ట్రకు చెందిన రత్నగిరి జిల్లాలోని కోట్లక్ అ కుగ్రామంలో పద్దెనిమిది వందల అరవై ఆరవ సంవత్సరం మే తొమ్మిద తేదీన జన్మించిన జాతి రత్నం గోపాలకృష్ణ గోఖలేగారు. చిన్నప్పుడ గోపాలరావుగా పిలవబడిన గోఖలే గారిలో - తండ్రి కృష్ణారావు గా సవ్యైక్యతాభావం, ఆత్మగౌరవం, వజ్రసంకల్పాలు వారసత్వంగ అబ్బాయనవచ్చు.

తల్లిగారైన సత్యభామ ఆదర్శ హైందవ ఇల్లాలి లక్షణాల మూర్తీభవించిన స్త్రీ. ఆర్థిక పరమైన ఇబ్బందులెన్ని ఎదురైనా చిరునవ్వు కొరతరానీయలేదు. తల్లిగారి మత విశ్వాసం, కుటుంబం పట్ల ఆ కనబరిచిన శ్రద్ధ గోపాలరావుని ప్రభావితం చేశాయి.

1879లో తండ్రిగారు చనిపోయేనాటికి గోపాలరావు వయ పదమూడు సంవత్సరాలే. ఆ తర్వాత తల్లి, మామగారైన అంతాజీ పం అన్నగారైన గోవిందరావుల సంరక్షణలో పెరిగిన గోపాలరావు చదు పట్ల అమితమైన శ్రద్ధాసక్తులు చూపించేవాడు. కాగల్ గ్రామంల ప్రాథమిక విద్యను పూర్తిచేసి వున్నత విద్యాభ్యాసం కోసం కొల్హాపూర్‌లో రాజారాం హైస్కూల్‌లో చేరాడు. 1881లో మెట్రిక్యులేషన్ పూర్తిచేసి గోపాలరావు 1883లో పూనాలోని దక్కన్ కాలేజీ నుంచి బి.ఏ. మొద సంవత్సరం 1884లో బొంబాయిలోని ఎల్ఫిన్‌స్టోన్ కాలేజీలో బి.ఏ. చి సంవత్సరం పూర్తి చేశరు. బి.ఏ. చివరి సంవత్సరం చదివే సమయంలో నెల ఇరవై రూపాయల ఉపకార వేతనం లభించడం అతని పేదరికానికి కొం ఊరట కల్గించినట్లైంది.

విద్యార్థిగా గోపాలరావు తనతోటి విద్యార్థులనే కాక, అధ్యాపకులను కూడా ఎంతగానో ఆకర్షించగలిగాడు. అసామాన్యమై జ్ఞాపకశక్తి - ఒకసారి చదివితే ఎటువంటి విషయాన్నైనా తడబాటులేకుండ చెప్పగలగే వాడట. దానికి తోడు నిరంతర గ్రంథ పఠనము- అది చూసి

ఎవరికైనా అసూయ కలిగే దనడంలో అతిశయం ఏముంటుంది? ఆయన అమితంగా ఇష్టపడిన పుస్తకాలలో స్కాట్ రచించిన రోక్‌బై, ఎడ్మండ్ బర్క్ రచించిన రిఫ్లెక్షన్స్ ఆన్‌ది ఫ్రెంచ్ రెవల్యూషన్ ముఖ్యమైనవి.

బి.ఏ. పూర్తయ్యాక ఇండియన్ సివిల్ సర్వీస్ చేయాలని మిత్రులు ఎంత చెప్పినా విన్పించుకోలేదు గోఖలే. అన్నగారికి ఇంకెంత మాత్రం ఆర్థికంగా భారం కాకూడదనుకొని, 1885 జనవరిలో పూనాలోని న్యూ ఇంగ్లీషు పాఠశాలలో నెలకు ముప్పైఐదు రూపాయల వేతనంతో ఉపాధ్యాయునిగా వుండేందుకు అంగీకరించారు. గోఖలే చేరేనాటికి ఆ పాఠశాల స్థాపించబడి ఐదు సంవత్సరాలే ఐనప్పటికీ - విద్యార్థుల్లో దేశ భక్తి, సహేతుకమైన ఆలోచనలతో పాటు తగిన విజ్ఞానాన్ని పెంపొందించడానికి కృషి చేస్తూ దాన్నో ఆదర్శ విద్యాలయంగా తీర్చి దిద్దాడు దాన్ని స్థాపించిన వి.కె. చిప్లంకార్, గోఖలే చేరే నాటికి బాలగంగాధర్ తిలక్, గోపాల్ గణేశ్ మొదలైన వారంతా ఆ పాఠశాలలో పనిచేస్తున్నారు. తన బోధనా సామర్థ్యంతో పిల్లలని బాగా ఆకర్షించి అనతికాలంలోనే మంచిపేరు తెచ్చుకున్నారు గోఖలే.

సహాధ్యాపకులైన తిలక్, అగర్ కార్‌ల సహవాసంలో ఆయనలోని పరిపక్వమైన సాహిత్య భావాలకు రూపుదిద్దుకోగలిగారు గోఖలే. అప్పుడే వారిద్దరూ గోఖలేని గురించి కేవలం తమలో ఒకనిగా కాక - అతని సాహిత్యాభిలాష, వజ్రసంకల్పాలను చూసి కొన్ని ప్రత్యేకతలున్న యువశక్తిగా గుర్తించి దక్కన్ ఎడ్యుకేషన్ సొసైటీకి శాశ్వత సభ్యునిగా ఆయన సేవలు చాలా అవసరమని భావించారు.

1886 జూన్‌లో దక్కన్ ఎడ్యుకేషన్ సొసైటీకి జీవితకాల సభ్యునిగా నియమించబడ్డారు గోఖలే. అప్పటి కాయన వయసు ఇరవై సంవత్సరాలైనా నిండలేదు. ఆ అరుదైన గుర్తింపు ఆయన వయసుకి కాక ఆయన సామర్థ్యానికి సౌశీల్యానికి జరిగిన అపూర్వమైన గౌరవంగా భావించవచ్చు. అప్పుడే ఆయన న్యూ ఇంగ్లీషు స్కూల్ నుంచి ఫర్గూసన్ కాలేజీకి

ఆహ్వానింపబడ్డారు.

చరిత్ర, గణితం, ఆంగ్లం ఇంకా రాజకీయ అర్థశాస్త్రాలను బోధించిన గోఖలే తన ప్రతిభా విశేషాలతో విద్యార్థుల హృదయాల్లో నిలచిపోయారు. 1904 వరకు ఫర్గూసన్ కాలేజికి ప్రిన్సిపాల్‌గా పనిచేసి విద్యావ్యాప్తికి ఎంతగానో కృషిచేశారు.

గోఖలే రాజకీయ గురువు మహాదేవ గోవింద రెనెడే. గతం నుంచి పాఠాలు నేర్చుకుంటూ, వర్తమానంలో జీవిస్తూ భవిష్యత్తుని నమ్మాలనే విషయాన్ని రెనెడే శిష్యరికంలో నేర్చుకున్నారు గోఖలే.

1886 లో మొదటి సారిగా ''బ్రిటిష్ పరిపాలన క్రింద భారతదేశం'' అన్న అంశం మీద కొల్హాపూర్‌లోని బహిరంగ సమావేశంలోని ప్రసంగంతో ఆయన ప్రజా జీవితం ప్రారంభమైనదనవచ్చు. 1889వ సంవత్సరం గోఖలే జీవితంలో గుర్తుంచుకోవాల్సిన సంవత్సరం. భారత జాతీయ కాంగ్రెస్‌లో చేరిన గోఖలే అదే సంవత్సరం డిసెంబరు 26న బొంబాయిలో జరిగిన కాంగ్రెస్ ఐదవ సమావేశంలో పాల్గొన్నారు. ఆ తర్వాత 1903, 1913, 1914 సంవత్సరాలలో తప్ప మిగతా వార్షిక సమావేశాలన్నింటిలోనూ పాల్గొన్నారు. ఆయన వాగ్ధాటి, సేవానిరతి దాదాభాయ్ నౌరోజీ, సురేంద్రనాథ్ చటర్జీ వంటి ప్రముఖనాయకులను కూడా ఆకట్టుకున్నాయి.

1905లో ఇండియా ప్రజల అభీష్టాలని, సమస్యలని బ్రిటిష్‌వారికి తెలియజేసేందుకు జాతీయ కాంగ్రెస్ ప్రతినిధులుగా లాలాలజపతి రాయ్, గోఖలేలు ఇంగ్లాండు వెళ్ళారు. 49 రోజుల పర్యటనలో 45 వుపన్యాసాలతో భారతీయుల మనో చిత్రాన్ని బ్రిటిష్ వారిముందు చక్కగా ఆవిష్కరించి వారి మన్ననలు పొందగలిగారు గోఖలే. అదే సంవత్సరం బనారస్‌లో జరిగిన కాంగ్రెస్ సమావేశానికి గోఖలే ఏకగ్రీవంగా అధ్యక్షుడయ్యారు.

1888 లో పూనాలోని సర్వజనైక సభకి గౌరవ కార్యదర్శి అయ్యారు. ఆ సభకి సంబంధించిన త్రైమాసిక పత్రికకు సంపాదకుడయ్యారు. తిలక్ ఈవిషయాన్ని పూర్తిగా వ్యతిరేకించారు.



కొల్లు రంగారావు

తిలక్ వ్యతిరేకతతో రెనెడేతో పాటు గోఖలే ఎన్నో సమస్యల్ని, అవమానాల్ని ఎదుర్కొన వలసి వచ్చినది. ప్రతి విషయంలోనూ వీరిద్దర్ని తిలక్ వేర్పాటు వాదులుగా చూశారు. జూలై 14, 1895 లో తిలక్ సర్వజనైక సభలో ముఖ్యమైన పదవులలో తన అనుచరులను నియమించుకోవడం రెనడే, గోఖలేలకు బాధను కలిగించడమే గాక, ఆసభనుంచి బయటకు రావడమే వుత్తమంగా తోచింది.

నవంబర్4, 1896 న దక్కన్‌సభ పూనాలో స్థాపించబడినది. ప్రజల రాజకీయ, సాంఘిక, ఆర్థిక ప్రయోజనాలను కాపాడటం సభ ప్రధానమైన ఆశయం. రెనెడే సలహా ప్రకారం 1901 వరకు దక్కన్ సభకి కార్యదర్శిగా పనిచేశారు గోఖలే. పూనా పురపాలక సంఘంతో కూడా గోఖలేకు సన్నిహిత సంబంధాలుండేవి. 1898 నుండి 1906 వరకు అందులో సభ్యునిగా వున్నారు. 1902 మరియు 1905 లో ఆ సంఘ అధ్యకునిగా కూడా ఎన్నికయ్యారు. అధ్యక్ష హోదాలో ఆయన ప్రజలకెంతో చేరువయ్యారు. డ్రైనేజ్, నీటి సరఫరా మున్నగు విషయాల పట్ల శ్రద్ధ తీసుకునేవారు. ప్రతి సమావేశంలోని ముఖ్యాంశాలని ముద్రించి సభ్యులకి, పత్రికల వారికి అందజేసేవారు.

1896 లో మహాత్మాగాంధీజీ గోఖలేని కలుసుకున్నారు. అప్పటికే దక్షిణాఫ్రికాలో భారతీయులు ఎదుర్కొంటున్న సమస్యలన్ని చూశారు గాంధీజీ. అందుకే వాటిని పరిశీలించి వాటిని రూపుమాపేందుకు తగిన పరిష్కారాలను అన్వేషించడానికి గోఖలే దక్షిణాఫ్రికా వెళ్ళాల్సిన అవసరాన్ని నొక్కిచెప్పారు. 1912 అక్టోబర్ 22 న దక్షిణాఫ్రికాలోని కేప్‌టౌన్‌చేరుకున్న గోఖలే నవంబర్17 వరకు విస్తృతంగా పర్యటించారు. ఆయనకు కార్యదర్శిగా వ్యవహరించిన గాంధీజీ తక్కువ కాలంలో ఎక్కువ మందిని కలుసుకునే ఏర్పాటు చేశారు. అస్వస్థతో బాధపడుతున్నా ప్రజల సంక్షేమానికి ప్రాధాన్యత నిచ్చిన దేశభక్తుడు గోఖలే. ఆయన పర్యటన వలన దక్షిణాఫ్రికాలో గోఖలే వాతావరణం ఏర్పడింది.

"పుట్టుకతో నేను హిందువునైనా, నా దేశ పురోగమనానికి భారతీయునిగా పాటుపడాలన్నదే నా జీవితాశయం" అని చెప్పుకున్న గోఖలే హిందూ-ముస్లింల సమైక్యతకు, కాంగ్రెస్ అంతరంగిక సమైక్యతకు ఎంతగానో పాటుపడ్డారు. 1905 లో అప్పటి గవర్నర్ జనరల్ కర్జన్ బెంగాలును రెండు రాష్ట్రాలుగా విభజించాడు. బెంగాలు విభజన తగదని గోఖలే ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసినా ప్రయోజనం లేక పోయింది.

గోఖలే అన్యాయంతోఎక్కడా రాజీపడలేదు. ప్రతి సంస్కరణ ఆయనకు గుర్తుంచుకో దగినదే. ఆయన కేవలం మాటల్లోనే కాక చేతల్లోనూ ఆదర్శవాది. రాజకీయపు హక్కులు మాట్లాడటానికి మాత్రమే పరిమితం కారాదని ఆయన విశ్వాసం. అన్యాయాన్ని ఎదిరించే ఏ పోరాటంలోనైనా నైతిక బలం చాలా అవసరమని ఆయన భావించేవారు. అసాధ్యం అనేది ఆయన నిఘంటువులో లేనిమాట. బ్రిటిష్ వారితో సంప్రదింపుల్లో ఎంతో సహనాన్ని, నేర్పుని చూపించేవాడు. ఎటువంటి పరిస్థితులలోను ఆశని, నిజాన్ని విస్మరించేవాడు కాదు.

రాష్ట్రాలకు స్వయం ప్రతిపత్తి కావాలనేది ఈనాటి మాటకాదు. దాదాపు ఏడు దశాబ్దాల క్రితమే గోఖలే దీన్ని అప్పటి ప్రభుత్వానికి సూచించాడు. ప్రాంతీయ ప్రభుత్వాలు భూమిశిస్తు, ఎక్సైజ్, అడవుల ద్వారా వచ్చే డబ్బుని మంచిపనులకు వినియోగించే అధికారం రాష్ట్రాలకి వుండాలని భావించేవాడు. కేంద్రం బాధ్యత ఈ నిధులు దుర్వినియోగం కాకుండా చూడటం, రక్షణ విషయంలో పూర్తి బాధ్యత వహించడం అనేవారు గోఖలే.

ఆనాటి జిల్లాస్థాయి పరిపాలనలోని రహస్యాలని శాసనాల అమలుతీరుని, పనులలోని ఆలస్యాన్ని ఎత్తి చూపాడు. జిల్లా పరిపాలకుడైనా కలెక్టర్‌కి కేంద్రంతో ప్రత్యక్ష సంబంధం వుండాలని కోరుకున్నాడు. గోఖలే ఆలోచనలు భవిష్యత్తుకు బంగారు బాటలు. వాస్తవిక అభివృద్ధికి ఆయన అధికార వికేంద్రీకరణ చక్కని ప్రణాళిక

" పుట్టుకతో నేను హిందువునైనా, నా దేశ పురోగమనానికి భారతీయునిగా పాటుపడాలన్నదే నా జీవితాశయం" అని చెప్పుకున్న గోఖలే హిందూ-ముస్లింల సమైక్యతకు, కాంగ్రెస్ అంతరంగిక సమైక్యతకు ఎంతగానో పాటుపడ్డారు. 1905 లో అప్పటి గవర్నర్ జనరల్ కర్జన్ బెంగాలును రెండు రాష్ట్రాలుగా విభజించాడు. బెంగాలు విభజన తగదని గోఖలే ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసినా ప్రయోజనం లేక పోయింది.

గోఖలే అన్యాయంతోఎక్కడా రాజీపడలేదు. ప్రతి సంస్కరణ ఆయనకు గుర్తుంచుకో దగినదే. ఆయన కేవలం మాటల్లోనే కాక చేతల్లోనూ ఆదర్శవాది. రాజకీయపు హక్కులు మాట్లాడటానికి మాత్రమే పరిమితం కారాదని ఆయన విశ్వాసం. అన్యాయాన్ని ఎదిరించే ఏ పోరాటంలోనైనా నైతిక బలం చాలా అవసరమని ఆయన భావించేవారు. అసాధ్యం అనేది ఆయన నిఘంటువులో లేనిమాట. బ్రిటిష్ వారితో సంప్రదింపుల్లో ఎంతో సహనాన్ని, నేర్పుని చూపించేవాడు. ఎటువంటి పరిస్థితులలోను ఆశని, నిజాన్ని విస్మరించేవాడు కాదు.

రాష్ట్రాలకు స్వయం ప్రతిపత్తి కావాలనేది ఈనాటి మాటకాదు. దాదాపు ఏడు దశాబ్దాల క్రితమే గోఖలే దీన్ని అప్పటి ప్రభుత్వానికి సూచించాడు. ప్రాంతీయ ప్రభుత్వాలు భూమిశిస్తు, ఎక్సైజ్, అడవుల ద్వారా వచ్చే డబ్బుని మంచిపనులకు వినియోగించే అధికారం రాష్ట్రాలకి వుండాలని భావించేవాడు. కేంద్రం బాధ్యత ఈ నిధులు దుర్వినియోగం కాకుండా చూడటం, రక్షణ విషయంలో పూర్తి బాధ్యత వహించడం అనేవారు గోఖలే.

అనాటి జిల్లాస్థాయి పరిపాలనలోని రహస్యాలని శాసనాల అమలుతీరుని, పనులలోని ఆలస్యాన్ని ఎత్తి చూపాడు. జిల్లా పరిపాలకుడైనా కలెక్టర్‌కి కేంద్రంతో ప్రత్యక్ష సంబంధం వుండాలని కోరుకున్నాడు. గోఖలే ఆలోచనలు భవిష్యత్తుకు బంగారు బాటలు. వాస్తవిక అభివృద్ధికి ఆయన అధికార వికేంద్రీకరణ చక్కని ప్రణాళిక

రెండో భార్యని కూడా పోగొట్టుకున్నాడు గోఖలే. ఆ తర్వాత కూతుళ్ళిద్దర్నీ చూసుకోవాల్సిన బాధ్యత గోఖలేపై పడింది. ఆయన వారినెంతగానో ప్రేమించేవాడు కాని, అందరు తండ్రుల మాదిరి వారితో ఎక్కువ సమయం గడిపే వీలుండేది కాదు.

గోఖలే జీవితమంతా మతవిశ్వాసం, దేశభక్తిలతో నిండివుంది. మతమనేది ఎవరికైనా వ్యక్తిగతమైనదని, అది ఎటువంటి వివాదాలకు దారితీయకూడదని ఆయన అభిమతం. ప్రేమేదైవమని నమ్మిన ఆయన్ని రాజకీయ ఋషిగా పేర్కొనవచ్చు, కొన్ని సందర్భాలలో బాలగంగాధర్ తిలక్ ఆయన్ని వ్యతిరేకించినా గోఖలే ఆయన నిజాయితీని ఎప్పుడూ శంకించలేదు. దేశసౌభాగ్యానికి పాటుపడటమే తమ ఇరువురి ధ్యేయమైనా అందుకు అవలంభించిన విధానాలు వేరువేరుగా వున్నాయి.

''జీవిత చరిత్ర ను వ్రాస్తూనో, విగ్రహాన్ని ప్రతిష్టిస్తూనో అమూల్యమైన కాలాన్ని వృధాచేసేబదులు ఆ సమయంలో నీ ఆత్మను పూర్తిగా దేశసేవకి అంకితం చేయి. అప్పుడు మాత్రమే నీవు భారతమాతకి నిజమైన, నమ్మకమైన సేవకుడవనిపించుకుంటావు''. అనేవాడు గోఖలే.

గోఖలే ప్రజాజీవితంలో స్వార్థానికి ఎంత మాత్రం తావులేదు. ప్రజా సంక్షేమం ధ్యేయంగా ఆయన తన సేవలను త్యాగనిరతితో జాతికి అంకితం చేశారు.

రేపటి పౌరులు కావలసిన ఎందరో బాల బాలికలు బాల కార్మికులుగా మారవలసిరావడం పట్ల ఆయనెంతగానో విచారం వ్యక్తం చేసేవాడు. యజమాన్యం వారి అన్యాయాలను ఆయన వెలుగెత్తి చాటాడు. అంతేకాదు బాల కార్మికుల వయసు పరిమితి పెంచి, చట్ట బద్ధమైన హక్కులు వారికి లభింపచేయాలని కోరాడు.

మార్చి **18, 1910**న ఉచిత నిర్భంధ ప్రాథమిక విద్య అవసరాన్ని పేర్కొంటూ ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. ఆ ప్రయాత్నాల్లో భాగంగానే **1911** మార్చి పదహారున ప్రాథమిక విద్య బిల్లు ప్రవేశపెట్టబడి ప్రభుత్వంచే

ఘోదింపబడినది. విద్యారంగానికి సంబంధించిన గోఖలే ఆలోచనలు
ున దేశీయులనే కాక బ్రిటిష్ ప్రముఖులను సైతం ఆకట్టుకున్నాయి.

చివరిక్షణం వరకు దేశాభ్యుదయానికి పాటుపడిన గోఖలే 1915 బ్రవరి 19న అనారోగ్యంతో మరణించారు. తిలక్ మాటల్లో ఆయన ారత దేశపు వజ్రం - మహారాష్ట్ర మాణిక్యం. ఒక్కమాటలో చెప్పాలంటే ోఖలే నూతన శకానికి యుగకర్త.

( 9-10-85, ఆకాశవాణి, యువవాణి, హైదరాబాదు.)

# అభినందన

ఎదుటివారిని ఆకట్టుకునేది 64 కళలకు కూడా అతీతమైనదిగా చెప్పుకోవచ్చు. ఎదుటి వ్యక్తి మంచిని మనసారా అభినందించే ఒక మంచి మాట చాలు అతనితో మరిన్ని మంచి పనులు చేయించేందుకు. మరోరకంగా చెప్పాలంటే అభినందన ప్రోత్సాహమే! బాధ్యతలను మరింతగా పెంచి అంచనాలను అధిగమింపచేస్తుంది అభినందన. మనలో ఎక్కువ మంది పైవాళ్ళ ఆశీస్సులుండాలని కోరుకోవడం సర్వ సామాన్యం - అంటే పైవాళ్ళ దృష్టిలో ప్రముఖంగా కనిపించడమన్న మాట. ఎన్నికలప్పుడు ఓ చీకటి వ్యాపారో, ఒక దగాకోరో లేదంటే మరొకరో ఏ పార్టీ పక్షాన నిలిచి గెలిచినా పేద జనోద్ధారకుడనో, నిరుపేదల పెన్నిధనో ఇంకొకటనో ప్రశంసిస్తూ అతని గెలుపుని నీతికి ప్రతీకగా అభివర్ణించే వారికి ఎంత మాత్రం లోటులేని సమాజం. ఆ నాయకుడు అధికారపక్షానికి చెందితే ఏదో ఒక చిన్న స్థానాన్ని మంత్రివర్గంలో పొందగలిగినా అతడికి బ్రహ్మరథం పట్టేవాళ్ళు, పట్టించే వాళ్ళ పోటీ పడుతుంటారు. పత్రికల ద్వారా కరపత్రాల ద్వారా అతగాడు వుద్ధరించింది ఏమున్నా లేకపోయినా అభినందనలు అందజేస్తుంటారు. సభలు, సమావేశాలు నిర్వహించి అతగాడిని ఆకాశానికి ఎత్తుతూనే వుంటారు.

నటీనటులు నటనతో ప్రేక్షకుల అభినందనలు అందుకోవాలని గాయనీగాయకులు, కవులు తమ ప్రతిభను ప్రజలు గుర్తించాలని ఆశించడం సహజం. వారు ఆయారంగాల్లో ఏదైనా విశిష్టతను సాధించినప్పుడు అభిమానులు వారిని అభినందనలతో ముంచెయ్యడం సర్వసామాన్యం. అంతటితో తమంతటి వారు లేరని విర్రవీగిపోయేవారు కొందరైతే అదే తమ మొదటి మెట్టని, చేరాల్సిన శిఖరాలు ఎన్నో వున్నాయని నిజాయితీతో తమ రంగాల్లో ముందు కెళ్ళేవారు అరుదుగా కనిపిస్తుంటారు.

ఎన్నో రంగాల్లో రాణించడం కన్నా మంచి వ్యక్తిగా జీవించడం గొప్పవిషయం. ఎదుటి వ్యక్తి మంచిని మనసారా అభినందించే ఒక మంచిమాటచాలు. అతను మరిన్ని మంచి పనులు చేసేందుకది ప్రేరణవుతుంది. ఏదో ఒక లాభమాశించి అభినందనలతో అనర్హులను ఆకాశానికి ఎత్తడమంటే అర్హులైన ఉత్తములెందరినో నిరుత్సాహపరచడమే.

(ఆకాశవాణి, నిజామాబాద్)

# దాంపత్య జీవితంలో సత్సంబంధాలు

పెద్దలు కుదిరించినా, యువతీ యువకులే పరస్పరం ప్రేమించిపెళ్ళి చేసుకున్నా ఎక్కడో పుట్టి ఎక్కడెక్కడో పెరిగిన ఒక యువతి ఒక యువకుడు పరస్పర విశ్వాసంతో, ప్రేమానురాగాలతో ఆలుమగలుగా నూరేళ్ళు కలిసి జీవించడం సామాన్యమైన విషయం కాదు.

నూరేళ్ళపంటగా, వెయ్యేళ్ళ అనుబంధంగా కొనియాడబడే పెళ్ళి అత్యధిక సందర్భాల్లో బేరమే అని చెప్పకతప్పదు. మానవ సంబంధాలు వ్యాపారమైతే బ్రతుక్కి అర్థంలేదని ఘోషించే వారు సైతం చాలా మంది దీనికి అతీతులు కాదు. వియ్యానికైనా, కయ్యానికైనా సమవుజ్జీ వుండాలంటారు. ముందేడు తరాలు, వెనకేడుతరాల మంచి-మర్యాదలు 'మాటలు' గానే మిగిలి పోతున్నాయి.

వయసు మళ్ళిన వారిని ఎవర్ని కదిలించినా వారి పెళ్ళిళ్ళప్పుడు ఇప్పుడున్నంత కట్నకానుకుల పిచ్చి వుండేది కాదంటారు. వారినే కనీసం ఒక్కవుదాహరణ చెప్పమనండి. డబ్బున్న యువకుడు గుణానికి ప్రాముఖ్యమిచ్చి నిరుపేద యువతిని పెళ్ళిచేసుకున్నట్లుగాని, ధనికురాలైన యువతి గుణవంతుడైన పేదవాణ్ణి పెళ్ళాడినట్లు...చెప్పలేక నీళ్ళు నమలక తప్పదు.

అరుదైన సందర్భాలను మినహాయిస్తే నాడైనా నేడైనా వరుడనే వాడు తాళి కడుతుంది కన్య మెడలో కాదు, కట్నం ఒడికి! ఓ ఖూనీకోర్ డబ్బుంటే చాలు తన కుమార్తెకో పోలీసాఫీసర్ని తేవచ్చు. ఓ గజదొంగ సొమ్ముంటే చాలు న్యాయమూర్తిని అల్లుడిగా కొనుక్కోవచ్చు. పొట్టకోస్తే అక్షరం ముక్క రానివాడైనా లక్షలుంటే చాలు విద్యాధికులైన వాళ్ళు అల్లుళ్ళవుతామని క్యూ కడతారు. డబ్బుండి అందుకు కొంచెం ప్రయత్నం చెయ్యగలిగితే ఆడకోతికైనా మనుషులనుండి మగణ్ణి వెతకడం కష్టంకాదు. పెళ్ళి చూపులు, నిశ్చితార్థాలు, మంగళతోరణాలు, సన్నాయిమేళాలు, పెళ్ళిపందిళ్ళు, విందు భోజనాలు ఆడంబారాలకి ప్రతి బింబాలయ్యాయే

కాని అనుబంధాలకు ప్రతీకలు కాలేక పోయినవని చెప్పకతప్పదు.

చదువులు, హోదాలు, అందచందాలు, సిరిసంపదలు పెళ్ళికి ముందు ప్రధానపాత్ర వహించినా పెళ్ళయ్యాక ప్రధానపాత్ర వహించాల్సింది నిస్సందేహంగా పరస్పర అవగాహన!

యవ్వనం ఇరువురి మధ్య ప్రధానమైన ఆకర్షణ అయినప్పటికీ అందుకు తగిన ఆలోచన తోడ్పడంది పుట్టుకొచ్చే పిల్లల భవిష్యత్తు ప్రశ్నార్థకంగానే మిగిలిపోతుంది. అన్యోన్యత, ఆలోచన కరువైన దంపతుల మధ్య మాటలు తీవ్రస్థాయిలో అచ్చతెనుగు నుడికారానికి ప్రతీకలై వినిపిస్తాయి. చూపులు అగ్నిని కురుస్తున్నట్లుగా కనిపిస్తాయి. ఒక్కమాటలో చెప్పాలంటే పచ్చిగడి వేస్తే భగ్గుమంటుందనిపిస్తుంది. సర్దుబాటు అనేదొకటి జీవితంలో లేనే లేదన్నట్లు, నిన్నుగాక మరెవరనినో పెళ్ళాడితే పువ్వుల్లో పెట్టి చూసే వాడని ఆమె, ఫలానా యువతినే పెళ్ళాడి వున్నట్లయితే నా కాలికి మట్టికూడా అంటనిచ్చి వుండేదికాదని అతడు అనుకోడానికి మించిన మూర్ఖత్వం మరొకటి వుంటుందా?

నరకమంటే ఏమిటమ్మా అని అమాయకంగా అడిగాడట పెళ్ళీడు కొచ్చిన కుమారుడు!

ఆ తల్లిగారు సమాధానమిచ్చేలోపే తండ్రిగారు కల్పించుకొని '' పిచ్చినాన్నా! పెళ్లయిన కొద్ది రోజుల్లోనే నీ భార్యామణి చూపించబోయే దానికి ఇప్పుడే వివరాలెందు '' కంటూ కుమారుణ్ణి నోరు మూయించాడట!

పెళ్ళిగాని కుర్రాళ్ళలో మీకెవరైనా శత్రువులుంటే మీరు తేలిగ్గా కక్ష తీర్చుకోవాలను కుంటున్నారా? మంచి సంబంధం అదే కట్నం బాగా వస్తుందని, అమ్మాయి అందచందాలతో పాటు ఆస్తిపాస్తులు బాగున్నాయని పెళ్ళి చెయ్యండి! మిమ్మల్ని వాళ్ళు జన్మ జన్మలకూ మరచిపోతే ఒట్టు!

సన్నని నడుం, సంపెంగలాంటి ముక్కు, దానిమ్మ గింజల్లాంటి

పలు వరుస స్త్రీ సౌందర్యాన్ని పెంచి చూపుతాయేమో గాని మగడి మాట పట్ల విశ్వాసం లోపించినపుడు ఇవెంత మాత్రం అండగా నిలబడలేవు. మానసిక ప్రశాంతతను అందించలేవు.

ఆరడుగుల ఎత్తు, కవ్వించే చూపులు, అయిదంకెల జీతమైనా మగవాడిని గొప్పవాడన్నట్టు భ్రమింప జేస్తాయేమో గాని పెళ్ళాం పట్ల ప్రేమాభిమానాలు లోపించినపుడు ఇవెంతమాత్రం అతగాడికి సుఖశాంతుల్ని ప్రసాదించలేవు.

పరస్పర అవగాహనలేని దంపతుల మధ్య పరస్పర విధేయతను ఆశించలేము. ఒకరి అభిరుచులు మరొకరు తెలిసికొని అందుకు అనుగుణంగా నడుచుకునేందుకు తమ అభిరుచుల్లో ఎదుటివారికి ఇబ్బంది కలిగించే వాటిని విడుచుకోవడం ముఖ్యం. ఆదరాభిమానాలు లేని చోట మాంగల్యానికి విలువ లేదు, వేదమంత్రాల మధ్య బంధు మిత్రులు వేసిన అక్షింతలకి పెళ్ళప్పుడు వధూవరులు పారవశ్యంతో పోసుకున్న తలంబ్రాలకి పెద్దల ఆశీర్వాదానికి బలం లేదు.

"జీవించు! జీవించనివ్వు" జీవన సూత్రం తెలిసిన భార్యా భర్తలెవరైనా ఒకరి మనసు ఒకరు తెలుసుకుంటూ ఎదుటి వారిలోపాలను అత్యుత్తమ స్నేహితుల్లా సరిదిద్దుకుంటూ ఆనందాన్ని స్వంతం చేసుకోవాలి. చిరు తగవుల మొలకలు మహావృక్షాలవక ముందే నిర్మూలించుకుంటూ మధురానుభూతులకు మార్గం నిర్మించుకోవాలి. భార్య తెచ్చే కట్నకానుకలను ఆశిస్తూ కూర్చునే భర్త, భర్త సంపాదనకి మించిన అవసరాలను పెంచుకునే భార్య దాంపత్య జీవితానికి మచ్చలుగానే మిగిలి పోతారు. భార్యా భర్తల్లో ఏ ఒక్కరు మిడసరంగా నడుచుకున్నా వారికి సుఖశాంతులు అందని వస్తువులుగానే మిగిలిపోతాయి. తనమాటే వేదం అనుకునే మూర్ఖత్వం ఏ ఒక్కరిలో వున్నా ఆ సంసారం ప్రత్యక్ష నరకానికి తార్కాణం అవుతుందే తప్ప ఆప్యాయతానురాగాలకు ఎంత మాత్రం చోటుండదు. అనవసరమైన పంతాలు పట్టింపులతో విడిపోయే

వారు కొందరైతే, ఆత్మహత్యలు పరిష్కారాలుగా ఈ లోకాన్నే విడిచిపోయే వారెందరో!

సహనం మనిషికిసహజమైన ఆభరణం. ముఖ్యంగా స్త్రీ విషయంలో. సహనం కోల్పోతున్నవారు ఎవరైనా సుఖశాంతులు కోల్పోతున్నట్లు గ్రహించాలి. అయితే సహనానికీ ఓ హద్దు వుంటుంది కదా! అది ఎవరికి వారు అనుభవంలో విధించుకోవాల్సిందే తప్ప చెబితే అర్థమయ్యేది కాదు. తెగేదాకా లాగడం ఎవరికైనా ముప్పే! అసంతృప్తులైనా అశాంతులైనా మొగ్గలో తుంచెయ్యడమే ఎవరికైనా శ్రేయస్కరం. ఎవరికి వారు తమ ఆలోచనలే సరైనవని అనుకోవడం, అంతటితో సరిపోదన్నట్టు మూడోవాళ్ళెవరో చిలవలు పలవలుగా చేసి చెప్పడం ఆలుమగలను తేలిగ్గా బజారుపాలు చేసేందుకు తోడ్పడుతాయి. భార్య అందివ్వని స్త్రీని మరో స్త్రీలో, భర్త అందివ్వని విలాసాలు పరాయివాడెవడో అందిస్తాడనే భ్రమలో తప్పటడుగులు వేస్తుంటారు. నిజాలు తెలిసే లోపు చేతులు కాలాక ఆకులు పట్టిన చందమవుతుంది తప్ప ప్రయోజనం వుండదు.

నాకేం తక్కువని అనుకనేవారికి ఆలోచించే ఓపికుంటే ఎవరూ చెప్పాల్సిన పనిలేకుండానే అంతరాత్మ సమాధానమిస్తుంది - బుద్ధి తక్కువని! అందుకే అకారణంగా భార్యల్ని హింసించే భార్యలున్నట్లే భర్తల్ని ఎన్నోరెట్లు హింసించే భార్యలున్నారు. ఆ బాపతువాళ్ళకు కారణం చూపించడం కష్టతరం కాదు. కోడి కూరవండి వడ్డించలేదని ఎక్కడపడితే అక్కడ శరీరంపై వాతలు పెట్టే మగరాయుళ్ళున్నట్లే కోరిన చీర కొనివ్వలేదని కనిపించని మానసిక వాతలు పెట్టే మహిళామణులున్నారు. అన్నింటి కన్నా విచారించదగ్గ విషాదహేతువు ఎవరిమాట సాగాలన్నది? లేదంటే ఎవరి పెత్తనం సాగాలి? తమ కాపురం సజావుగా నడిచి పదిమందికి ఆదర్శంగా వుండాలని కోరుకునే వారికి అధికారంఎవరు చెలాయించినా ఇబ్బందిలేదు. సంసారంకన్నా వ్యక్తిగత విషయాలు ఎక్కువైనపుడే చిక్కులు తప్పవు. ఒకసారి చిక్కుల్లో చిక్కుకున్నాక అది మరిన్ని చిక్కులకు మూలం అవు

తుందే తప్ప ఎక్కువమందిలో జ్ఞానోదయం కలిగించే అవకాశం అతి తక్కువ. అపోహలముందు అవగాహన పనికిరాని దవుతుంది.

పెళ్ళిళ్ళు స్వర్గంలో కుదర్చబడతాయంటారు. పుణ్యంకొద్దీ పురుషుడని, గుణం కొద్దీ ఇల్లాలని అంటారు. మరి, నిత్య జీవితంలో జరుగుతున్న దేమిటి? స్వర్గం, పుణ్యం అన్నీ పైకంలోనే చూడటం స్వర్గసాధారణమై పోయింది. అందుకే మేడ్ ఫర్ ఈచ్ అదర్ నానుడి అర్థం కూడా మార్చి చెప్పుకోక తప్పదు. కట్న కానుకల దాహంతో భర్త, గొంతెమ్మ కోర్కెలతో భార్య పరస్పరం పీడించుకుంటూ ఒకరినొకరు అనుక్షణం ఈసడించుకుంటే సంసారజీవితంలో తియ్యదనం ఏముంటుంది? మనసులో మమతాను రాగాలులేని చోట స్త్రీ పురుషులెవరికీ సంతృప్తివుండదు. మమకారం లేని చోట మాంగల్యానికి విలువలేదు. మగడిగా మగాడికీ గౌరవం వుండదు. ఆప్యాయత లేనిచోట భార్యగా మహిళ స్థానమెంత నికృష్టమో ఊహించడం కష్టంకాదు. అంచేత ఇరువురిమధ్య సాన్నిహిత్యాన్ని సదవగాహనను పెంచలేని పెళ్ళి జరగక పోవడమే మేలు. ఒకవేళ జరిగినా వారికి సంతానం కలగకపోవడమే శ్రేయస్కరం. కోట్లకు పడగలెత్తినా శ్రద్ధలేని పెంపకంలో పిల్లల భవిష్యత్తు అంధకారమే. పెరిగే పిల్లలముందు తల్లిదండ్రుల పోట్లాటలు, కొట్లాటలు వారిని మానసికంగా ఎంతగానో కృంగదీస్తాయి. ఎక్కువ సందర్భాలలో ఈరకం పిల్లలు చెడుకి ప్రతీకలవుతారు తప్ప మంచికి వారసులు కాలేరు.

పెళ్ళిని పవిత్ర బంధంగా, నూరేళ్ళ అనుబంధంగా భావించేవారికి హక్కులకన్నా బాధ్యతలే ప్రధానంగా అనిపిస్తాయి. ఎవరెక్కువ ఎవరు తక్కువనే ఆలోచనలకు అవకాశం లేకుండా ఇరువురిమధ్య దాంపత్య జీవితం నిత్యనూతనమై వృద్ధిచెందే అవకాశవుంది. చదువులు, హోదాలున్నా లేక పోయినా బాధ్యతాయుతంగా జీవించగలిగే వారే భావితరాలకు ఆదర్శప్రాయులై నిలుస్తారు. సమస్యలు లేని జీవితంలేదు. భార్యా భర్తలు అందుకు మినహాయింపు కాదు. ఆ సమస్యలు వారిద్దరికే

సంబంధించినవైతే సామరస్యంగా పరిష్కరించుకునే ప్రయత్నం చెయ్యాలి. చెడనేది ఎవరిలో వున్నా తొలగించుకోవలసిందే. మంచి ఎవరిలో వున్నా కష్టమని, నిష్ఠురమని అనిపించినా స్వీకరించిన వారే జీవితంలో రాణించగలుగుతారు.

మనిషిని మనిషిగా చూడగలిగే అవగాహన లేనివారికి పెళ్ళికి మించిన శిక్ష మరొకటి లేదు. అందుకే పెళ్ళినో విషవలయంగా, నూరేళ్ళ ఖైదుగా పేర్కొనే వారున్నారు. అలాగని ప్రేమించుకోవడం (లేదంటే ఆకర్షించు కోడం) వరుల్ని కొనుక్కోవడం ఎంతమంది మానేస్తున్నారు?

శారీరకంగా, మానసికంగా తగిన ఎదుగుదల లేకనే ప్రేమకైనా, పెళ్ళికైనా తొందర తగదు. బంధుమిత్రులు తొందర పెడుతున్నారనో, బామ్మగారో తాతగారో పోరు పెడుతున్నారనో సాకులు అనవసరం.

యువతీ యువకుల్లో పెళ్ళి చేసుకోవాలనే కోరిక బలపడే ముందు వాళ్ళకాళ్ళపై వాళ్ళు నిలబడగలగడం చాలా ముఖ్యం. ఒకరు కనీసం మరొకరినైనా పోషించగలిగే సామర్థ్యం కలిగివుండాలి. పేద, మధ్య తరగతి కుటుంబాల్లో వుండే వారికి బాధ్యతలు ఎక్కువగానే వుంటాయి. వృద్ధాప్యంలో వున్న తల్లి దండ్రులు, తనకంటే చిన్నవారైన తమ్ముళ్ళు, చెల్లెళ్ళు - వీరందరకీ అండగా నిలబడాల్సిన బాధ్యత వున్నవారు ప్రేమలను, పెళ్ళిళ్ళను కొన్నేళ్ళయినా వాయిదా వేసుకోవడం మంచిది.

చదివే ప్రేమ కథలు, చూసే శృంగార చిత్రాలు కలగలిసి కలిగించే వికారచేష్టలకే ప్రేమని పేరు పెట్టుకోవడం ఎంతవరకు సమంజసం? కథల్లో సినిమాల్లో నాయికా నాయకుల మధ్యవుండే ప్రేమే జీవితమనే భావన నిజ జీవితంలో ఆశించడం అవివేకం అవుతుంది. చదువుకునే వయసులో చదువుపైనే పూర్తిదృష్టిని కేంద్రీ కరించాలి. చదువుపట్ల ఆసక్తిలేనివారు, చదువుకునే అవకాశాలు అంతగా లేనివారు వారివారి వృత్తుల్లో తమ నైపుణ్యం పెంపొందించుకోవాలి. ఆ తర్వాతే ప్రేమలయినా, పెళ్ళిళ్ళ యినా! జీవితంపట్ల సరైన అవగాహన ఏర్పరచుకొని, కష్టాల్లో కృంగక, సుఖాల్లో పొంగక రెండింటిని సమంగా స్వీకరించువారే దాంపత్య జీవితంలో సత్సంబంధాలు నెలకొల్పి సుఖశాంతులతో జీవించగలుగుతారు.

**( 4-7-94,** ఆకాశవాణి, నిజామాబాద్)

## కొల్లు రంగారావు
## ముద్రిత రచనలు

1. వెలుగు పువ్వులు (కవితా సంపుటి)
2. వాఢ్యత ఊపిరిగా (కవితా సంపుటి)
3. మానవతా మందిరం (గేయసంపుటి)
4. పతాకం స్వేచ్ఛగా ఎగురుతుంది (కవితా
5. స్వేచ్ఛా స్వరాలు (రాష్ట్ర కవుల కవితా
6. రేడియో ప్రసంగాలు



త్వరలో...

1. ప్రజల సాక్షిగా (కవితా సంపుటి)
2. రేడియో రూపకాలు
3. రేడియో కథలు
4. రేడియో నాటికలు

ముద్రణ అనిల్ కంప్యూటర్స్